21.అశ్వినులారా! వశుడనువానికి ఒక్కపూటలోనేవేలకొలది ధనలాభముకలిగించినారు. వరదులగుమీరు ఇంద్రునితో కూడి దు:ఖములకలిగించు అపకీర్తిగలశత్రువులనునిశ్శేషముగా వధించినారు.

22.ఋచత్కుని పుత్రుడుశరుడు, అతడు దాహముగొనిఅశ్వినులను స్తుతించినాడు.అశ్వినులు అతనికి బావినీరుబయటకు తెప్పించిఇచ్చినారు. శయుడనువానికొఱకు గొడ్డుటావునుపాలిచ్చుదానినిగా చేసినారు.

23.కృష్ణుని పుత్రుడు విశ్వకుడు.అతడు సదా స్తుతులందేకాలము గడుపువాడు.విశ్వకుని పుత్రుడు నిష్ణావుడుతప్పిపోయినాడు. అశ్వినులుతప్పిపోయిన తనయునితండ్రికి తెచ్చిఇచ్చినారు. పోయిన పశువుమరల లభించినట్లువిశ్వకుడు సంతోషించినాడు.

24.రేభుడు అను ఋషినిరాక్షసులు త్రాళ్లతోకట్టి నీటిలోనికిత్రోసినారు. రేభుడుపదిపగళ్లు, పదిరాత్రులునీళ్లలో పడి ఉన్నాడు.అట్టి వానిని అశ్వినులు,అధ్వర్యుడు స్రువముతోసోమమును పక్కకుచేర్చినట్లుదరి చేర్చినారు.

25.అశ్వినులారా! మీరు సాధించినకార్యములను వర్ణించివివరించినాను. నాకుమంచి గోవులు,పుత్రులు కలుగవలెను.నేను ఈ దేశమునకురాజును కావలెను.ఇంద్రియ సుఖములు,దీర్ఘాయువు అనుభవించితన ఇంటికి చేరుకున్నట్లువార్ధక్యమును చేరవలెను.

## ఆలోచనామృతము

1. మంత్రములందుకథాకథనము ప్రారంభమయినది.ఇది కథకు బీజమువంటిది.ఇచట ప్రారంభమయినకథపాయలయి, నదులయి,మహానదులయిఅవధులులేనిసముద్రమంతఅయినది. ఒక్కొక్క సంఘటననుకథగా తీర్చుట ముచ్చటగాఉన్నది.

2. నపుంసకునిభార్యకు సంతానము,గొడ్డటావుకు పాలవిషయము ప్రస్తావించబడినవి.ఇవి కృత్రిమ సంతానమునకుసంకేతములు కావచ్చును.

3. విరిగినకాలును మరల కూర్చుటకృత్రిమ అవయవములముకూర్చుటకావచ్చును.

4. అశ్వినులుగుఱ్ఱములులేనిస్వయంచాలక రథమునుకనుగొన్నారని తెలుసుకున్నాము.భూచరమయినఎద్దును భూ, జలచరమైనమొసలిని రథమునకుకట్టుట మరొక ప్రయోగము.ఒకే వాహనమునీటిమీదను నేలమీదనుప్రయాణమునకుఅనువయినదియుకావచ్చును.

5. అశ్వినులరథము అతివేగవంతముఅని చెప్పినాము. దానినిధృవపరచు కథ17వ మంత్రమునఉన్నది. సూర్యునిఅందాల కూతురు సూర్య.ఆమెను దేవతలుఅందరు ఆశించినారు. పరుగు పందెమునఅశ్వినుల రథము నెగ్గినది.సూర్య అశ్వినుల రథముఎక్కినది. దేవతలుదానిని ఆమోదించినారు. ఆరోగ్యదేవతలయినఅశ్వినులకే కదా సూర్యునిపుత్రిక దక్కవలసినది!

6. ప్రతిమంత్రముకథవలె చెప్పవలెననిపించినది.అప్పుడు నేను అనువాదకార్యముమాత్రమే నిర్వహించుచున్నానుఅన్న నా పరిధి గుర్తుకువచ్చినది.

### నూటపదిహేడవసూక్తము

### ఋషి-కక్షీవంతుడు,దేవత-అశ్వినులు,ఛందస్సు-త్రిష్టుప్

1. అశ్వినులారా!సోమరసము సిద్ధముగాఉన్నది. ీ ముదముకొఱకు చేయబడినది.సనాతనుడగు యజమాని◌మ్ము సే◌ంచుచున్నాడు.ఋత్వికులు స్తోత్రములుచదువుచున్నారు.సోమము దర్భల◌ీదఉన్నది. ీరు ◌చ్చేయుడు.మాకు అన్నమును,బలమును ప్రసాదించుడు.

2. అశ్వినులారా!ీరు సర్వప్రేరకులు. మంచిగుఱ్ఱములనుపూన్చిన ీ రథముమనోవేగము కలది.ఆ రథము◌ీద ీరు యజ్ఞకర్తఇంటికి వెళ్లుదురు.అదే రథము ీదమా ఇంటికి ◌చ్చేయుడు.

3. వరములుప్రసాదించగల అశ్వినులారా!హితవరుడగుసూర్యుని రాహువుపట్టినపుడు ◌డిపించినారు.పాపకూపమగు శతద్వార గృహమునుండిఅత్రిని రక్షించినారు. అమంగళకరుడయి,హింసించు దస్యునిమాయలను వరుసగానివారించినారు.

4. అశ్వినులారా!ీరు సత్కర్మలు చేయింతురు.వర్షములు కురిపింతురు.రేభుని రాక్షసులు నీటిలోత్రోసినారు. అవయవములుసడలిన అశ్వమును సేదదీర్చినట్లురేభుని సేదతీర్చినారు.ీరు చేసిన పనులునశించున◌ కావు.

5. భూగర్భమున నిద్రించువానివలె,చీకటినూతిలోపడినసూర్యునివలెనగలకుగాను తెచ్చినముడిబంగారమువలెబా◌లోపడి ఉన్నవందన రుషిని అశ్వినులురక్షించినారు.

6. సత్కర్మప్రేరకులగు అశ్వినులారా!వేగవంతములయినీ గుఱ్ఱముల డెక్కలనుండినూరు కుండల మద్యమునుప్రవహింపచేసినారు.అట్టి ఘనకార్యమునుఅంగిరసుడునయిన నేనుస్తుతించుచున్నాను.

7. అశ్వినులారా!ీరు సత్కర్మలు చేయింతురు.◌మ్ము స్తుతించినకృష్ణుడనువానికొడుకు◌శ్వకునకు అతని పుత్రుడు◌ష్ణాపుని తెచ్చిఇచ్చినారు. ఘోషయన్నుబ్రహ్మవాదినికుష్టురోగమున బాధపడినది.పెళ్లికాక పుట్టింటనేఉండిపోయినది. ీరు ఆమెనురోగ◌ముక్తను చేసినారు.భర్తను కూర్చినారు.

8. అశ్వినులారా!వృషదుని పుత్రునకుచెవులు ప్రసాదించినారు.శ్రావర్షికి కుష్ఠురోగముమాపి భార్యను సమకూర్చినారు.అంధుడయిన కణ్వరుషికిదృష్టి ప్రసాదించినారు.ఇ◌ అసామాన్య కార్యములు,నుతింపవలసిన◌.

9. అశ్వినులారా!ీరు ఒక్కొక్క పనికి ఒక్కొక్క రూపముధరింతురు. ీరు వేదునకువేగముగలది, వేలకొలదిధనములనుఇచ్చునది, శత్రువులకుఅందనిది, శత్రువులసంహరించునది,ఆపదల తరింపచేయునదిఅగు అశ్వమును అనుగ్రహించినారు.

10.భూరిదాతలగుఅశ్వినులారా! ీ గుణగణములుస్తవనీయములు.భూలోక, ద్యులోకరూపులగు ీకు ప్రియమయినస్తుతిమంత్రమువెలువడినది.అంగిరో గోత్రులు ◌మ్ముపిలిచినపుడు అన్నములతో◌చ్చేయుడు. ీస్తుతినిఎరిగిన నాకు అన్నముప్రసాదించుడు.

11.అశ్వినులారా! ీరు పోషకులు,సత్య స్వభావులు.అగస్త్యుడు ◌మ్ము స్తుతించినాడు.ీరు బుద్ధిశాలియైనభరద్వాజునకుఅన్నము కలుగచేసినారు.'◌శ్పల'కు పోయిన పాదము సంధించినారు.

12.అశ్వినులారా! ీరు సూర్యపుత్రులు.వర్షప్రదాతలు.శయుని రక్షించినారు. ధనమునిండినకుండను భూ◌నుండివెలికితీసినట్లునీటిలోపడినరేభుని పదవనాడువెలికితీసినారు. క◌పుత్రునిస్తుతులు ◌నబోయిఎచట ఉంటిరి?

13.అశ్వినులు తమవైద్య◌ద్యచేతచ్యవనుని యవ్వనునిచేసినారు. వారి రథమున'సూర్య' సంపద సహితముగాచేరినది.

14.అశ్వినులు యవ్వనులు.పూర్వము నుండి స్తుతించదగినవారు.తుగ్రునివలనమరింత స్తోత్రవ్యులుఅయినారు. వారు భుజ్యునిపక్షివలె ఎగిరియు,గుఱ్ఱమువలెపరుగెత్తియు రక్షించినారు.తండ్రికి చేర్చినారు.

15.తుగ్రుడు తనకొడుకు భుజ్యునిసముద్రముపైదపంపినాడు, భుజ్యుడుఅశ్వినులను పిలిచినాడు.మనోవేగముగలమంచి గుఱ్ఱములుపూన్చిన రథారూఢులుఅయిన అశ్వినులు భుజ్యునిరక్షించినారు.

16.ఒక పిచ్చుక తోడేటినోటపడినది. ఆ పిచ్చుకఅశ్వినులకు మొరపెట్టుకున్నది.అశ్వినులు వెంటనేఆ పక్షిని విడిపించినారు. జాహుషునిరథముపైద కొండకొనకుచేర్చినారు. 'విష్వాచుడు'అను రాక్షసుని కుమారుని విషంఇచ్చి చంపినారు.

17.అశ్వినుల వాహనమయినగాడిద తోడేలురూపముదాల్చినది. ఋజ్రాశ్వుడుఆ తోడేలునకు నూరుగొఱ్ఱెలను ఆహారముగఅందించినాడు. అందుకుకోపించిన ఋజ్రాశ్వునితండ్రి అతనిని అంధునిచేసినాడు. అశ్వినులుగ్రుడ్డివాడగు ఋజ్రాశ్వునకువెలుగువంటినేత్ర దృష్టినిప్రసాదించినారు.

18.అంధునకు దృష్టికిఇప్పించుటకు తోడేలుఅశ్వినులను ప్రార్థించినది.జారుడు నిర్లక్ష్యముగాధనము ఖర్చుచేసినట్లు నూటొక్కగొఱ్ఱెలను ముక్కలుగానరికి నాకు ఇచ్చినాడు.

19.అశ్వినులారా! మీరు ఉత్తమపరిపాలకులు. స్తోత్రార్హులు.రోగగ్రస్తులను ఆరోగ్యవంతులుగాచేయగలవారు.విశ్పల మిమ్ము ప్రార్థించగావెళ్లిన రథముపైదనేసర్వరక్షణతో విచ్చేయుడు.

20.అశ్వినులారా! మీరు దర్శనీయులు."శయువు" ఆవు కృశించినది.గొడ్డుపోయినది. పాలుఇవ్వనిది. అట్టిఆవును పాలిచ్చుఆవునుగా చేసినారు.పురుమిత్రుని కూతురునుమీ ఉపాయమున విమదునిభార్యనుగా చేసినారు.

21.అశ్వినులారా! ఆర్యుడనునరునిచే నాగటితోభూమిని దున్నించినారు.యవధాన్యపు విత్తనాలనుచల్లించినారు. దస్యులనువజ్రాయుధమునపరిమార్చినారు. ఇట్లుమీరు పరాక్రమములుకావించినారు.

22.అధర్వణ పుత్రుడగుదధీచికి ఇంద్రుడుమధు, ప్రవర్గవిద్యలను ప్రసాదించినాడు. అశ్వినులారా!మీరు కోరినంతనే దధీచిమీకు ఆ విద్యలు బోధింతునుఅన్నాడు. మీరు దధీచికిగుఱ్ఱపు తలనుఅమర్చినారు. దధీచివలనరహస్యమగు మధువిద్యను,ప్రవర్గవిద్యనుపొందినారు.

23.అశ్వినులారా! మీరు బుద్ధిశాలురు.సత్యవచనులు.నేను సర్వదా అనుగ్రహమునుఅర్థించుచున్నాను.నేను చేయు సకలకార్యములను రక్షించుడు.నాకు పుత్ర పౌత్రాదులతోకూడిన ధనమునుప్రసాదించుము.

24.అశ్వినులారా! మీరు దాతలు,సర్వకర్మ ప్రేరకులు, వధ్రిమతిఅను బ్రహ్మవాదినికి"హిరణ్యహస్తుడు"అను పుత్రుని ప్రసాదించినారు.మూడు భాగములుగానరకబడిన 'శ్యేవు'నిబ్రతికించినారు.

25.అశ్వినులారా! ప్రాచీనములగుమీ వీర కృత్యములనుమా పూర్వజులు మాకుచెప్పినారు. కోరికలనుతీర్చగల మిమ్ముమేము మంత్రరూపమయినస్తోత్రములతోప్రార్థించుచున్నాము.మాకు పుత్ర పౌత్రాదులనుప్రసాదింపుడు. మేముమిమ్ము యజ్ఞములందుఆహ్వానించుచుందుము.

## నూటపదునెనిమిదవ సూక్తము

### ఋషి-కక్షీవంతుడు,దేవత-అశ్వినులు-ఛందస్సు-త్రిష్టుప్

1. కోర్కెలుతీర్చునట్టిఅశ్వినులారా! మీరథముమూడు నొగలు కలది.మనోవేగ, వాయువేగములుకలది. ధనప్రదము,సుఖప్రదము అయినది.ఆ రథము మాకు అభిముఖముగారావలెను.

2. మూడునొగలు కలదియు,మూడు ంధములుగాతీర్చబడినదియు,మూడు చక్రములుకలదియు, సుఖప్రదముఅయినదియు అగు రథమునఅశ్వినులు మాకు అభిముఖముగారావలెను. అశ్వినులారా!మా ఆవులను పాడిగలవానినిచేయుడు. మాగుఱ్ఱములనుంజయవంతములనుచేయుడు. మాపుత్రపౌత్రాదులను వర్థిల్లచేయుడు.

3. దర్శనీయులగుఅశ్వినులారా! పూర్వకాలపు ంద్వాంసులుతమ దారిద్ర్యనిర్మూలనకు ుమ్ము స్తుతులతో ఆహ్వానించినారు.మాస్తుతులనుంనుటకు ీ దృఢమయినరథమున ంచ్చేయుడు.

4. అశ్వినులారా!ీ అశ్వములు జలములవలెవేగవంతములు.ఆకసమున ఎగురు డేగలవలెసంచరించగలం. అట్టిస్తుతింపదగిన అశ్వములనుపూన్చిన రథమునీరు హంస్సులు అందుకొనుటకువత్తురు. అట్లేమావద్దకు ంచ్చేయగలరు.

5. అశ్వినులారా!ీరు సర్వప్రేరకులు. అందవతియువతి అయిన సూర్యునికూతురు ీ ీదమక్కువ కలిగి ీ రథమునుఎక్కినది. మంచిరూపముగలం, ఎగురగలం,వడిగలం అగు ీ గుఱ్ఱములుుమ్ము ీవద్దకుతొడ్కొని రావలెను.

6. అశ్వినులారా!ీరు వరదులు. దర్శనీయులు.ీదక్షతతో వందనుని,రేభుని బాంనుండింముక్తి కలిగించినారు.తుగ్ర పుత్రుడుభుజ్యుని సముద్రమునుండి దరిచేర్చినారు.ముదుసలి చ్యవనునకుయవ్వనము కలిగించినారు.

7. అశ్వినులారా!ీరు ఉముక నిప్పును చల్లార్చినారు.అత్రిని ంముక్తుని చేసినారు.అతనికి సుఖప్రదము,శక్తియుక్తమయినఆహారము ప్రసాదించినారు.కణ్వుని పొరలు క్రమ్మననేత్రములకుదృష్టిని ప్రసాదించినారు.అట్టి ుమ్ము స్తుతించుచున్నాము.

8. అశ్వినులారా!శయుడు పూర్వకాలపు వాడు.యాచించువాడు.అతని గోవును పాలుఇచ్చునట్లు చేసినారు.ఆడ పిచ్చుకను బాధనుండింముక్తము చేసినారు.ంశ్పలకు తెగిపోయినకాలును తగిలించినారు.

9. అశ్వినులుతమకు ఇంద్రుడుఇచ్చిన అశ్వమును'వేదు'నకు ఇచ్చినారు.ఆ గుఱ్ఱము బలమైనది.వయసుది. శత్రుంజయము.అనేక యుద్ధములుచేసినది.

10.అశ్వినులారా! ీరు మంచిజన్మలు కలవారు.ప్రసిద్ధులు. మాకుధనము ప్రసాదించమని యాచించుచున్నాము.రక్షణ కల్పించమనిప్రార్థించుచున్నాము.మా స్తోత్రములుంనుటకు ీరు ధనమునిండిన రథముీదంచ్చేయుడు. మాకుసుఖములు సమకూర్చుడు.

11.అశ్వినులారా! ీకు హంస్సులుఅందించుచున్నాను.ఉషస్సు ఉడుగునపుడు ుమ్ముఆహ్వానించుచున్నాను.ీరు నన్ను అనుగ్రహించుడు.వేగవంతములగుఅశ్వములీద ంచ్చేయుడు.

నూటపందొమ్మదవ సూక్తము

ఋషి-కక్షీవంతుడు,దేవత-అశ్వినులు,ఛందస్సు-జగతి

1. అశ్వినులారా!ీ రథము ఆశ్చర్యకరము.మనోవేగముగలది.వేగవంతములయినఅశ్వములు కలది.యాగార్హమయినది. అనేకధ్వజములుకలది. వర్షించగలది.ధనములు కలది.ధనములు ఇచ్చునది.నేను ఆయువుకోరి ుమ్ముఆహ్వానించుచున్నాను.ీరు అట్టి రథముీద ంచ్చేయుడు.హంస్సులు అందుకొనుడు.

2. అశ్వినులరథము నడుచుచున్నది.మేము ఊర్థ్వముఖులమయిమనస్ఫూర్తిగా స్తుతించుచున్నాము.మా స్తుతులు అశ్వినులనుచేరుచున్నం.నేతితో కూడి

రుచిగలహ◌ంస్సులనుచేయుచున్నాము.ఋత్విజులుహ◌ంస్సులనుసంస్కరించుచున్నారు.అశ్వినులారా! ◌ీరు ఉషోదయముతోబయలుదేరుడు.

3. యజ్ఞములుచేయువారు, జయశీలురు,ధనముకొఱకుపోటీలుపడువారుయుద్ధములుచేయుదురు. అప్పుడుఅశ్వినుల రథము భూ◌ు◌ీదఅగపడును. అశ్వినులారా!◌ుమ్ము స్తుతించువారివద్దకు ఆ రథము◌ీద ◌చ్చేయుడు.

4. భుజ్యుడుసముద్రమునపడి ఉన్నాడు. అశ్వినులుఅతనిని స్వయముగా పూన్చుకొనగలఅశ్వములు ఉన్న రథము◌ీదరక్షించినారు. అతనిని అతనితలిదండ్రులవద్దకుచేర్చినారు. దివోదాసునిఅశ్వినులు రక్షించినవృత్తాంతము మాకుతెలియును.

5. అశ్వినులారా!◌ీ అశ్వములు స్తవనీయములు.వాటిని ◌ీరు ◌ీ రథమునకుపూన్చివారు. ఆ అశ్వములు◌ుమ్ము సూర్యుని వద్దకుచేర్చిన◌. తదనంతరముసూర్యపుత్రి ◌ుమ్ముప్రే◌ు◌ంచినది. వరించినది.◌ుమ్ము పతులనుజేసికొన్నది.

6. అశ్వినులురేభుని ఉపద్రవమునుండి రక్షించినారు. అత్రినిరక్షించుటకు ఉముకనిప్పునుచల్లార్చినారు. శయునిఆవును పాలు ఇచ్చునట్లుచేసినారు. అవయవములుశిథిలములయిననందర్శికి దీర్ఘాయువుప్రసాదించినారు.

7. అశ్వినులారా!◌ీరు అందములగు శిల్పములుమలచుటలోనేర్పరులు. రథమునుబాగుచేసినట్లునందర్శిని ఆరోగ్యవంతునిచేసినారు. తల్లిగర్భమున ఉండి వామదేవుడు◌ుమ్ము స్తుతించినాడు.◌ీరు మేధా◌ అగు వామదేవునితల్లిగర్భమునుండిపుట్టించినారు. ◌ీఈ ఘన కార్యములతోయజమానిని రక్షించగలరు.

8. తండ్రి◌డిచి దూరమునఉన్న భుజ్యుని◌ీద, అశ్వినులారా! ◌ీరు దయతలచినారు.రక్షించుటకు భుజ్యునిస◌ీపించినారు. ◌ీరు సర్వజనులకుసుఖములను, రక్షణలనుప్రసాదింతురు. అందువలనసమస్త జనులు◌ుమ్ము ఆపేక్షించుచున్నారు.

9. అశ్వినులారా!మధు◌ద్య కోరి తేనెటీగ◌ుమ్ము స్తుతించినది.◌ీరు దధీచిని సే◌ంచినారు. ◌ీరుసమకూర్చిన అశ్వశిరసుధరించిఅతడు ◌ీకు మధు◌ద్య ఉపదేశించినాడు.ఉశిజ పుత్రుడు కక్షీవంతుడుసోమపానము ని◌ుత్తము◌ుమ్ము ఆహ్వానించుచున్నాడు.

10.అశ్వినులారా! వేదునికొఱకు ◌ీరు ఒక అశ్వమునుసిద్ధము చేసిఇచ్చినారు. అది అనేకులుకోరదగినది, శత్రుంజయము,శ్వేతము, ప్రకాశవంతము,అజేయము. ఇంద్రునిపోలినది. అన్ని పనులకుఉపయోగపడునది.అట్టిది ◌ీరు వేదునకుఇచ్చిన అశ్వము.

## నూటఇరవదవ సూక్తము

ఋషి-కక్షీవంతుడు,దేవతలు-అశ్వినులు,ఛందస్సు-1. గాయత్రి,2. కకుప్, 3. కా◌రాట్, 4. నష్టరూపి,5. తనుశిర, 6. ఉష్ణిక్కు, 7.◌స్తారబృహతి,8. ర◌◌రాట్టు ◌ుగిలిన◌గాయత్రి

1. అశ్వినులారా!◌ుమ్ము పూజించు స్తవముఎట్టిది? ◌ీ ఇరువురిలోప్రసన్నుడగువాడుఎవడు? ◌ీ మహిమలుఎరుగనివాడు ◌ుమ్ము ఎట్లుభజించవలెను?

2. మహిమలుఎరుగని స్తుతికర్త, సర్వజ్ఞులగుఅశ్వినులనే మార్గమునుగురించి అడుగవలసిఉన్నది. ఇతరులుజ్ఞాన రహితులే!అశ్వినులు శత్రువునకులొంగువారు కారు. భక్తులకుసాక్షాత్కరింతురు.

3. అశ్వినులారా!ీరు జ్ఞానులు. ిద్వాంసులు.ిమ్ము స్తుతించవలసినస్తుతిని ీరే తెలుపవలెను.మేము ిమ్ము ఆహ్వానించుచున్నాము.స్తుతించుచున్నాము.హిస్సులు అర్పించుచున్నాము.

4. అశ్వినులారా!ిమ్మే అడుగుచున్నాను.ఇతరులను అడుగను.ిషట్ కృతము, రుచ్యము,శక్తిదము అయిన సోమమునందు భాగము స్వీకరించుడు.మమ్ము ఉద్యోగవంతులనుచేయుడు.

5. అశ్వినులారా!ిమ్ము ఘోష అనునామెపుత్రుడు సుహస్తుడు,భృగువు స్తుతించినారు.కక్షీవంతుడు ఆ స్తుతులతోనేిమ్ము ప్రార్థించుచున్నాడు.ీరు అతనిని అనుగ్రహించవలెను.అతనికి అన్నము ప్రసాదించవలెను.

6. అశ్వినులారా!ఋజ్రాశ్వుడు గాయత్రీసామమునిమ్ము భజించిదృష్టి బడసినాడు.ఆ గాయత్రి సామముననేిమ్ము నేను భజించుచున్నాను.

7. అశ్వినులారా!ీరే ధనదులు.ీరే రక్షకులు. ీరే ినాశకులు.మాకు శుభములుకలిగించుడు. మమ్ము రక్షించుడు. చెడునుపోగొట్టుడు. దొంగలనుండికాపాడుడు.

8. అశ్వినులారా!మైత్రిలేని వారిముందుమమ్ము నిలుపవద్దు.గోవులు దూడలనురక్షించునం. దూడలులేని గోవులు మాఇల్లు వదలి పోకుండచూడుము.

9. అశ్వినులారా!స్తుతి కర్తలు ిమ్ముస్తుతించుచున్నారు.ిత్రులు పోషణకుతగు ధనమునుపొందుచున్నారు. మమ్ముఅన్నవంతులనుధనవంతులనుచేయగలరు.

10.బలవంతులగుఅశ్వినులయొక్క గుఱ్ఱములులేనిరథమును నేనుఅర్చించినాను. ఆ రథమేనాకు శ్రేయస్సు కలిగించును.

11.ధనదమగు రథమా!మాకు పురోభివృద్ధినిప్రసాదించుము. అశ్వినులునిన్ను అధిరోహించియేసోమపానమునకుగానుస్తోత్రపాఠకులవద్దకువెళ్లుదురు.

12.స్వప్నమును గురించియు,లోభిని తలంచియుదు:ఖించుచున్నాను.స్వప్నము, లోభిఇరువురు నశించవలెను.

(ప్రథమమండలమునపదిహేడవఅనువాకము సమాప్తం)

ఎదునెనిందవఅనువాకము　　నూటిరువదిఒకటవ సూక్తము

ఋషి-కక్షీవంతుడు,దేవత-ఇంద్రుడులేక ిశ్వేదేవతలు,ఛందస్సు-త్రిష్టుప్

1. ఇంద్రుడునరులను రక్షించువాడు.గోరూపమగు ధనములనుఇచ్చువాడు. మేముఅంగిరసులము. ఇంద్రునిస్తుతించుచున్నాము.అతడు మా ప్రార్థనలనుఆలకించవలెను.ఇంద్రుని మేడలుగలయజమానులుఆశ్రయింతురు. వారివద్దకువచ్చిన ఇంద్రుడుఈ యజ్ఞమునకువచ్చును.

2. ఇంద్రుడుప్రసిద్ధుడు. ద్యులోకమునుశాశ్వతము చేసినాడు.అతడు సూర్యరూపముదాల్చినాడు.జీవనాధారమయినవర్షమును కలిగించుచున్నాడు.అతడు వర్షాధిదేవత.అతడు గుఱ్ఱమునుండిఆవును సృష్టించినాడు.

3. ఇంద్రుడుసూర్యరూపుడు. ఉషస్సును ప్రకాశింపచేయువాడు. అతడునిత్యము అంగిరసులస్తుతులు ిినును.వారికి ధనములుప్రసాదించును. అతడువధార్హుల కొఱకువజ్రాయుధమునునిర్మించినాడు. సకలప్రాణుల రక్షణకొఱకుద్యులోకమునుపడకుండ నిలిపినాడు.

4. ఇంద్రుడుసోమము పానముచేసినాడు. ఉన్మత్తుడుఅయినాడు. గుహలోదాచిన గోవులను◌డిపించినాడు. ఇంద్రుడుముల్లోకములకుప్రభువు. అతడునరులకు ద్రోహముచేయువారిని కూల్చినాడు.

5. ఇంద్రుడుశీఘ్రముగ కార్యములునెరవేర్చువాడు. సర్వజగత్పాలకమగుద్యావాపృథ్వులు అతనికొరకే సమృద్ధములుఅయిన◌. జగదుత్పత్తికారకమగు హ◌స్సు ఆ◌ర్భ◌◌చినది.యజమానులుఇంద్రునకు పరిశుద్ధములయినగోక్షీరములను సమర్పించినారు.

6. ఇంద్రుడుమమ్ము బాధలనుండి◌ముక్తులను చేయవలెను.మాకు ఆనందము కలిగించవలెను.అతడు ఉషవద్దసూర్యునివలె తేజరిల్లిఉన్నాడు. ఆహవనీయస్థానమున సోమముస్రువముతో చల్లబడుచున్నది.అప్పుడు ఇంద్రుడు తనహ◌స్సులనుఅందుకొనును. ఆనందించును.

7. ఇంద్రుడుసూర్యరూపమున మేఘమునుతపింపచేయును.జగత్తునకు వర్షముకలిగించును. ఇంద్రుడుసూర్యరూపమున ప్రకాశించినపుడుఅడ◌కి కట్టెలకుపోవువాడు, పశువుకొఱకుసాగువాడు కార్యోన్ముఖులుఅగుదురు.

8. ఇంద్రా!మనోహరము,మాదకము, ◌ర్యవంతము,వాయువేగవంతమగుసోమమును నీ కొఱకుసిద్ధము చేసినాము.నీవు ◌చ్చేయుము.యజ్ఞమున ◌గిలినసోమమును హరిఅను నీ గుఱ్ఱములకుత్రాగించుము. ధనమునుఅపహరించు శత్రువునుపరిమార్చుము.

9. ఇంద్రా!నిన్ను అనేకులు ఆహ్వానింతురు.నీ ఆయుధము వజ్రము.అది ఇనుముతో చేయబడినది.ద్యులోకమునకన్నప్రకాశించునది. శీఘ్రుగా◌.త్వష్ట నిర్మించినది.దానిని నీవు శుష్ణాసురుని◌ద ప్రయోగించినావు.కుత్సుని రక్షించుటకుసకల ఆయుధములతోఅతని చుట్టునిలిచినావు. శుష్ణునికాపాడినావు.

10.పూర్వము శుష్ణాసురుడు చీకటిరూపముననను, మేఘరూపముననుసూర్యుని ఆవరించినాడు.ఇంద్రుడు వజ్రమునఆ శుష్ణాసురుని అంతమొందించినాడు.అప్పుడు సూర్యుడు తనప్రకాశమున వెలిగినాడు.

11.ద్యావా పృథ్వులు గొప్ప◌.శక్తిమంతములు.సర్వ వ్యాప్తములు. ఇంద్రుని◌రకృత్యములకుఆ ద్యావా పృథ్వులు సంతసించిన◌.ఇంద్రుడు సర్వత్రవ్యాపించిన వృత్రునితన వజ్రాయుధమునప్రవహించుజలములందుసంహరించినాడు.

12.ఇంద్రా! క◌పుత్రుడు శుక్రుడునీకు వజ్రాయుధమునుఇచ్చినాడు. అది శత్రుసంహారకము. వృత్రునివధించతగినది.అట్టి వజ్రాయుధమునకుపదును పెట్టినావు.వేగవంతములయిననీ అశ్వములను రథమునకుపూన్చుము. రథమునుఅధిరోహింపుము.

13.ఇంద్రా! నీవు సూర్యరూపముసప్రకాశించినావు. నీ రథాశ్వములనుపచ్చనికిరణములవలె◌హరింపచేసినావు.నీ రథచక్రములనుసూర్యుని అశ్వములవలెవేగవంతములుచేసినావు. తొంబదినదులను దాటినావు.యాగ ◌రోధులనుహతమార్చినావు.

14.వజ్రాయుధధారీ!ఇంద్రా! ఎంతో కష్టపడి పోగొట్టదగినదారిద్ర్యము నుండిమమ్ము దరి చేర్చుము.పాపము వలన ప్రాప్తించినయుద్ధములందుమమ్ము రక్షింపుము.మాకు రథములు,అశ్వములు మున్నగువానికొఱకుధనమును ప్రసాదించుము.మేము ఆధనముతోఅన్నమును, కీర్తిని,సత్యవాక్యమునుసంపాదింతుము.

15.ఇంద్రా! నీవు ధనవంతుడవు.పూజ్యుడవు. మేమునిన్ను నుతించుచున్నాము.నీ అనుగ్రహముమా ిషయమున తగ్గనీయకుము.మాకు సమృద్ధిగా అన్నములను,గోవులను, పుత్రపౌత్రాదులను ప్రసాదింపుము.మమ్ము ఆనందింపచేయుము.

**దాశరథిలక్ష్మణాచార్య బుచ్చమాంబలపౌత్రుండును, ిద్వాన్‌వేంకటార్య వేంకటాంబలపుత్రుండును, ఆంధ్రఆస్థానకి దాశరథి కృష్ణమాచార్యఅనుజుండను,కమలానాిన్న ధర్మపత్నిసహితుండను ివేకానందుడు శకుంతల,మాళిక, అగ్నిిత్రుడు,ఊర్వశి, ిక్రముడు, వేంకటేశ్వరమాహాత్మ్యము,మహాత్ముడుఇత్యాది అనేక బాలసాహిత్యగ్రంథకర్తయు అగు దాశరథిరంగాచార్య ిరచితమయినఆంధ్రవచనఋగ్వేద సంహితప్రథమ మండలమున(ఎనిిదవ అధ్యాయముతోకూడిన) మొదటిఅష్టకము సమాప్తము.**

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః

## రెండవఅష్టకము

శుక్లాంబరధరంిష్ణుం శశివర్ణం చతుర్భుజం/
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్విఘ్నోపశాంతయే//

ఓంనతా మనన్తి మాయినోనధీరా వ్రతా దేవానాంప్రథమా ధ్రువాణి/
నరోదసీఅద్రుహ వేద్యాభిర్నపర్వతాని నమేత స్థివాంసః//

### మొదటిమండలము-మొదటిఅధ్యాయము-పద్దెనిిదవఅనువాకము
### నూటఇరువది రెండవ సూక్తము-ఋషి-కక్షీవంతుడు,దేవత-ిశ్వేదేవతలు,ఛందస్సు-త్రిష్టుప్

1. కోపములేనిఋత్విజులారా!మా రక్షణ కొఱకు యాగమునునిర్వహింపుడు. హిస్సులనుఫలప్రదుడగు రుద్రునకుసమర్పింపుడు. రుద్రుడుఅమ్ములపొదులవంటిమరుత్తులతో కూడినవాడు.ముల్లోకములనుండిఅసురులను పారద్రోలువాడు.ద్యావాపృథ్వుల మధ్యఉన్న మరుత్తులతోకూడిన రుద్రుని నుతించుచున్నాము.

2. దివారాత్రులారా!పిలువగనే వచ్చుభార్యవలె మాఆహ్వానములుఅందుకొని ిచ్చేయుడు.సూర్యుని బంగారుకాంతి ధరించి,అందములు అలముకొన్నఉష మా పూర్వాహ్వానమును
మన్నింపవలెను.

3. సూర్యుడుమాకు తృప్తికలిగించవలెను.వర్షములు కలిగించువాయువు మాకు తృప్తికలిగించవలెను.ఇంద్రుడు, పర్జన్యుడుమా మనసులు నిర్మలముగాఉంచవలెను.సమస్త దేవతలుమాకు సమృద్ధిగా ఆహారముప్రసాదించవలెను.

4. అశ్వినులుకీర్తిమంతులు. చరుపురోడాశభక్షకులు. సోమపాయులు.ఉశిపుత్రుడనగు కక్షీవంతుడనునేనీ ఉషఃకాలమునఅశ్వినులను ఆహ్వానించుచున్నాను.పూజించుచున్నాను.ఋత్విజులారా!జలముల పౌత్రుడుఅగ్నిని స్తుతింపుడు.
(జలములవలనవృక్షములు కలుగును.అందువలన వృక్షములుజలముల పుత్రులు.వృక్షముల వలనఅగ్ని కలుగును. అందువలనఅగ్ని జలములకుపౌత్రుడు అగును)

5. దేవతలారా!నేను ఉశిజపుత్రుడగుకక్షీవంతుడను. పాండురోగముపోగొట్టుకొనుటకుఘోషయను బ్రహ్మవాదినిిమ్ము స్తుతించినట్లునేను స్తుతించుచున్నాను.పిలుచుచున్నాను.ఫలదాతఅగు పూషదేవుని నుతింతును.అగ్నియొక్క దాతృత్వమునునుతింతును.

6. ిత్రావరుణాలారా!మా ఆహ్వానములనుయజ్ఞములందలిమా స్తోత్రములనుివినుడు. జలాధిదేవతలగుీరు క్షేత్రములనునీటిలో తడుపుచుమా కీర్తనలనుఆలకించుడు.

7. మిత్రావరుణులారా!కక్షీవంతునకు అపరిమితమయినగోధనమును కలిగించుడు.అన్నదానయుక్తమయినయజ్ఞమునుకలిగించుడు. మీరు ప్రసిద్ధమగురథమున విచ్చేయుడు.ప్రీతిని, పుష్టిని కలిగించుడు.

8. దేవధనమును కీర్తింతును.మేము పరస్పరము స్నేహముగలవారము కావలెను.మాకు పుత్రపౌత్రులుకలుగవలెను.మేము పరస్పర ప్రేమాభిమానములుకలిగి ఉండవలెను.మాకు అన్నములు,అశ్వములు, రథములుకలుగవలెను.

9. మిత్రావరుణులారా!ఒకడు మీయాగము చేయక,రెండవవాడు మీకుగానుసోమము పిండక ద్రోహముచేయుచున్నారు.ఆ ఇరువర్గముల ద్రోహులురోగగ్రస్తులు అగుచున్నారు.మరొకడు యజ్ఞముచేయుచున్నాడు.స్తుతించుచున్నాడు.సోమము సిద్ధముచేయుచున్నాడు.

10.మిత్రావరుణులారా!మిమ్ము పూజించువాడువినయవంతుడగును.రథవంతుడగును.శత్రుంజయుడుఅగును. ప్రసిద్ధుడుఅగును. దాత అగును. శూరుడుఅగును యుద్ధములందునిర్భయుడు అగును.నరులకు బెదరనివాడుఅగును.

11.దేవతలారా! మీరుసర్వాధికారులు. ఆనందదాయకులు,నేను అమృతుడను.స్తుతికర్తను. నరుడను.నా ఆహ్వానమునుమన్నించుడు. నేనురక్షకులులేనివాడను.మీరు ఆకసమున సంచరించువారు.విచ్చేయుడు. నాస్తోత్రమునుఆలకించుడు. శ్లాఘించుడు.

12.హవిస్సులు అందించిఆహ్వానించు యజమానులకుపుష్టిని ఇచ్చునది,ఇతరులకు ఉపయోగపడునది,ఇప్పుడు అక్కరకు వచ్చునట్టిఅన్నములనుప్రసాదింతుము అన్నారుదేవతలు. ఆ దేవతలుయాగములందు మాకుఅన్నములను,సంపదలను ప్రసాదించవలెను.

13.పది ఇంద్రియములకుతృప్తి కలిగించునట్టిపదివిధములఅన్నములకొఱకుపదిఋత్విజులుయజించు దేవతలనుస్మరించుచున్నాము.మాకు దేవతలుప్రభువులయిఉండగా ఇష్టాశ్వ, ఇష్టదశ్మివంటి శత్రువులుమమ్ము ఏమి చేయగలరు?

14.ప్రసిద్ధులు, పూజ్యులుఅగు దేవతలనుఆహ్వానించుచున్నాము.వారు విచ్చేయవలెను.స్తుతులను వినవలెను.మాకు ధనధాన్యాదులుప్రసాదించుటకు తగినన్నిక్షీరాది హవిస్సులనుస్వీకరించవలెను.మాకు స్వర్ణకుండలములు,రత్నహారములు,రమణీయ రూపులయినపుత్రులను ప్రసాదించవలెను.

15.నన్ను-కక్షీవంతునిమశర్మారుడను రాజుయొక్క అజ్ఞానులయిననలుగురు పుత్రులుబాధించుచున్నారు.ఆవయశుడను రాజపుత్రులుముగ్గురు బాధించుచున్నారు.మిత్రావరుణులారా!మీ రథము గొప్ప రూపము,సుఖకరమగు కాంతి కలిగిసూర్యునివలె ప్రకాశించవలెను.

## నూటఇరువది మూడవసూక్తము

### ఋషి-కక్షీవంతుడు,దేవత-ఉష, ఛందస్సు-త్రిష్టుప్

1. ఉషసమర్థురాలు. విశాలమయినఆమె రథము సిద్ధమయినది.మరణము ఎరుగని దేవతలుఆమె రథమున ఆసీనులుఅయినారు. ఆ దేవి నరులకొఱకు చీకట్లు తొలగించవచ్చినది. కారుచీకటినుంచికాంతిరేఖ అయి ఉదయించినది.

2. జగములకన్నముందుయజమానులకుఅన్నము ఇచ్చునదియైనఉష మేల్కొన్నది.ఉష కాంతి దాత. ప్రకాశవతి.మహిమాన్వితయువతి. పునర్భవ.ఉషఉదయించినది.తొలిపిలుపునకే యజ్ఞశాలలోఅవతరించుచున్నది.

3. ఉషోదే◌!నీది శోభన జననము.నీవు నరులనుపాలించుదానవు.వారి కొఱకు నీవెలుగును◌భజించి ఇచ్చినావు.ఆ వెలుగులుగలమమ్ము ఇష్టార్థములనుఇచ్చువారు, మనసున్నవాడు,స◌తృదేవుడు,దోషరహితులనుగాసూర్యునకు నివేదించవలెను.

(సూర్యుడుస◌తృడు ఒక్క రే అయ్యు◌ధి నిర్వహణవలన పదభేదము,స◌తృడు పాప పుణ్యములుపరిశీలించువాడు. సూర్యుడుఫలప్రదాత)

4. ఉషోదే◌ప్రతిదినముప్రతియజ్ఞగృహమునుప్రకాశవంతము చేయుచున్నది.జగములకు కాంతినిప్రసాదించుటకు ప్రతిదినముఆ◌ర్భ◌ంచుచున్నది.వెలుగులు పరచుచున్నది.హ◌ర్భాగములనుఅందుకొనుచున్నది.

5. ఉషా!నీవు సన్మార్గవర్ధిని◌.సూర్యునకు సోదరి◌. దేవతలందరిని◌ంచినదానవు.స్తవనీయవు. దు:ఖముకలిగించువారికి శత్రువవు.నీసాయమున వైరులనుజయింతుము.

6. తి◌రమునమునిగిన జగములకువెలుగులు ఇచ్చును.ఉషోదే◌ అవతరించినది.మానోళ్లనుండిప్రియములు, సత్యములుఅయిన వాక్కులే వెడలవలెను.మా బుద్ధులుసర్వదా కార్యనిమగ్నములుకావలెను. అగ్నులు◌క్కిలి ప్రజ్వరిల్లిపైకి లేవవలయును.

7. రాత్రింబవళ్లువంతులుగా ఒకదానితరువాత ఒకటివచ్చుచున్న◌.రాత్రి చీకటిరూపమున పాపము చేయుచున్నది.దివాభాగమయినఉషోదే◌ కాంతులు రథము◌దవచ్చి వెలుగులుపరచుచున్నది.

**8.**ఉషోదేవతలుపగలు ఒకదానికి ఒకటిసమానములు. రేపుకూడ అన్యోన్యములుఅగుచున్న◌. దోషరహితములగుఉషస్సులు వరుణస్థలమును సే◌ంచుచున్న◌. సూర్యునకుముప్పది ఆమడలముందు పుట్టుచున్న◌.ఒక్కొక్క ఉషస్సు తమ గమనాగమనములనుతన ఉదరమునందేనిర్వహించుచున్న◌.

9. ఉషదివాగమనమునుతెలియజేయుచున్నది.ఉష స్వయంప్రకాశకము. ఉష తి◌రమునుండి జన్మించుచున్నది.యజ్ఞస్థానమునహ◌స్సు మున్నగువానినిప్రకాశింపజేయుచున్నది.ఉపకారము చేయుచున్నది.

10.ఉషా! నీవు కన్యవలెఉన్నావు. ◌కసించినఅవయవములుగలప్రౌఢవయి ఉన్నావు.కోర్కెలు తీర్చగలసూర్యుని ప్రియునిగా పొందినావు.యువతివయి భర్తముందుచిరునవ్వులు చిందించుచునిలిచినావు. సర్వాంగములనుప్రదర్శించుచున్నావు.

**11.**ఉషా! తల్లి అలంకరించినతనయవలె◌రాజిల్లుచున్నావు.నీవు సర్వజనులకుదర్శనము ఇచ్చుచున్నావు.జగములకు సుఖములుకలిగించు వెలుగుప్రసరింపచేయుచున్నావు.అందువలన నిన్నుఅందరూ స్తుతించుచున్నారు.నీవు చీకట్లనుపారద్రోలుము. ఇతరులకుఆ పని అసాధ్యము అగును.

12 .ఉషస్సులు అశ్వవతులు,గోవతులు, సూర్యకిరణవతులు.ఉషస్సులు అంధకారములనుఅంతముచేయుప్రయత్నమునఉన్న◌. ఉషస్సులు ఉపకారములు,స్తవనీయములు.ఉషస్సులు తరిగిపోవుచున్న◌.ఉషస్సులు తిరిగి అవతరించుచున్న◌.

13.ఉషోదే◌! నీవు సత్యస్వరూపుడగుసూర్యుని జ్కిరణములనుదాల్చినావు. మాకుఅట్టి శుభకర్మములను,ధనమును ప్రసాదించుము.

## నూటఇరువది నాలుగవసూక్తము

### ఋషి-కక్షీవంతుడు,దేవత-ఉషస్సు, ఛందస్సు-త్రిష్టుప్

1. ఉషా!మండుచున్నజ్వాలలవలెతి◌రములను
◌్రంగుచుఉదయభానునివలెకాంతివంతమయిప్రకాశించుచున్నావు.మేము ప్రాత:కాలకర్మలను
ఆచరించుచున్నాము.సూర్యుడు గోధనమునుఇతర ధనములనుప్రసాదించవలెను.రాక పోకలు కలిగించవలెను.

2. ఉష,దేవతా సంబంధమగువ్రతములనుఅనుకూలింపచేయుచున్నది.నరులకు సంయోగ
◌యోగములుకలిగించుచున్నది.గతించిన, రానున్నఉషస్సులకు సమమయిననేటి ఉషఅవతరించినది.

3. ఉషద్యులోకమునకుకూతురు వంటిది.తూర్పున తేజస్సుఅను వస్త్రమునుపరచుచున్నది.జనులను
పనులకుపురిగొల్పుచున్నది.ఉష సూర్యుని మార్గమునుఅనుసరించును. అన్నియుతెలిసినదానివలెనాలుగు
దిశలనుఎరుకపరచును.

4. ఉషసూర్యుని కిరణ సమూహతీరమునకనిపించుచున్నది.నోధస్సు తన మంత్రములచేకోరికలను
ప్రకటింపచేసినట్లుఉష తన తేజస్సునుప్రకటించుచున్నది.తల్లి పిల్లలనుతిట్టి లేపినట్లుఉష జనులను
జాగృతముచేయుచున్నది.రాత్రి ◌టుని ఇంటికిపోయి ఉదయము తిరిగివచ్చు జారిణివలెఉదయమున
◌కసించుచున్నది.

5. సర్వవ్యాపియగుఅంతరిక్షపు పూర్వార్థమునఉష ఉదయించును. ఆమెదిశల జ్ఞానముకలిగించును.
ద్యావాపృథ్వులు ఉషకు మాతాపితరులు.ఆమె వారి పక్కన నిలిచిసర్వమును
తేజోవంతముచేయుచున్నది.

6. ఉష◌స్తరించును. ఆమె దేవతలకు,మానవులకు సుఖదృష్టికలిగించును. ఆమెదినిర్మల దేహము.ఆమె ప్రకాశము
అల్పవస్తువునుగాని,అనల్పవస్తువునుగాని◌డువదు.

7 .తోబుట్టువులులేనిఆడది పుట్టింటికిచేరినట్లు సూర్యునిచేరుచున్నది.◌తంతువు జీ◌కకొ◌అకు
రాజాస్థానములకుచేరినట్లు ఉషసూర్యస్థానము చేరుచున్నది.భర్తవద్దకువెళ్లు స్త్రీ మంచిదుస్తులు ధరించినట్లుఉష
తన రూపమునువెలిగించుచున్నది.

8. చెల్లెలువంటి రాత్రి అక్కవంటిఉషకు అపరరాత్రిని దాటిఅప్పగించి వైదొలగుచున్నది.ఉష
సూర్యకిరణములచేతచీకట్లు పారద్రోలించి,లోకములను మెరుపులమొత్తమువలెవెలిగించుచున్నది.

9 .పురాతన ఉషస్సులు సోదరీభావముకల◌. గడచిన దానినిఅనుసరించి ప్రతిదినపుఉషస్సు వచ్చుచున్నది.న◌న
ఉషస్సులు కూడగడిచిన ఉషస్సులనుఅనుసరించి సత్కర్మానుష్టానముకల◌ అగుచున్న◌.అ◌ మాకు సకల
సంపదలుప్రసాదించవలెను.

10.ధనవతీ! ఉషా!హ◌స్సులు అర్పించుమమ్ము మేల్కొలుపుము.ధనలోభముకలిగి మేల్కొననిమా
శత్రువులనుదీర్ఘనిద్ర పుచ్చుము.నీవు ఆయువు హరించుదానవు.యజమానికి ధనసమృద్ధి కలిగించుము.

11.ఉష సకల వస్తువులందుచేరి తూర్పు దిక్కునవర్ధిల్లుచున్నది.ఉష తన రథమునకుఎర్రని గోవులను
పూన్చుచున్నది.చీకట్లను పారద్రోలుచున్నది.సమస్తమును వెల్లడిచేయుచున్నది.ఇంటింట అగ్ని వెలుగొందుచున్నది.

12.ఉష ఉదయించినది.పక్షులు గూళ్లు వదిలిఎగురుచున్న◌. నరులుఆహారాన్వేషణకు
బయలుదేరుచున్నారు.యజమానులుయజ్ఞశాలలందుహ◌స్సులు అర్పించుచున్నారు.ఉష వారలకు అధిక
ధనముప్రసాదించుచున్నది.

13.స్తోతార్హులగు ఉషస్సులారా!ిమ్ము రెండు సూక్తములందలిమంత్రములస్తుతించినాను.
మాకుఅభ్యుదయమును,యాచకులకు అపరిితధనములు ఇవ్వగలిగినంతధనములనుప్రసాదించుము.

## నూటఇరువది అయిదవ సూక్తము

## ఋషి-కక్షీవంతుడు,దేవత-దానము,ఛందస్సు-త్రిష్టుప్

1. తనవద్దకుఉదయమున వచ్చినవారికి స్వనయుడు అనురాజు రమణీయధనములనుఇచ్చును. కక్షీవంతుడుఆ ధనమును తండ్రికిఅర్పించినాడు. అతడుఆ ధనమును వృద్ధిచేసినాడు. పుత్రపౌత్రులనుపోషించినాడు. జీితమునుపెంచుకున్నాడు. మంచికొడుకులు కలిగి వర్ధిల్లినాడు.

2. పుత్రా!ఆ రాజునకు నీవు ఉదయపుఅతిథిి అయినావు. త్రాటితోమృగములను పక్షులనుకట్టినట్లుఆ రాజు నిన్ను ధనమునబంధించినాడు.అట్టి స్వనయుడుమంచి గోవులు,అశ్వములు, ధనసమృద్ధికలవాడు. ఇంద్రుడుఅతనికి అధిక సంపదప్రసాదించును.

3. నిన్నఉదయము ఈ రాజునా పుత్రునకు ధనమునుఇచ్చినాడు. కర్మానుష్ఠాతఅగు ఆ రాజును చూచుటకుఈ ఉదయము అతనియజ్ఞస్థానమునకువచ్చినాను. నాకుఅందిన ధనముతోసోమము సిద్ధముచేసినాను. దేవతలారా!సోమము స్వీకరించుడు.శత్రువులనునిరసించు, పుత్రపౌత్రాదులతోకూడిన ఆ రాజునుప్రియసత్యవాక్యములచేవృద్ధి చెందించుడు.

4. గోవులుపాలను స్రిించుచున్ని.సుఖములు కలిగించుచున్ని.గోవులు యాగముచేయు వారిని, చేయబోవువారినిసుఖపెట్టుచున్ని.జనులను సంతోషపెట్టువారినిజనులను రక్షించువారినిఅన్న సమృద్ధి హేతువులగుఆజ్యధారలు ఆనందపరచుచున్ని.

5. దేవతలకుహిిస్సులు అర్పించివారిని ప్రీతులనుచేసిన మానవుడుస్వర్గమును పొందుచున్నాడు.దేవతలమధ్యవర్తించుచున్నాడు.అతనికొిఅకు జలముసారవంతమయి ప్రవహించుచున్నది.భూిి సస్యములనుఇచ్చుచున్నది.సర్వవేళల సంతోషపరచుచున్నది.

6. దానముచేసినవారికే రమ్యవస్తువులు లభించుచున్ని.దానము చేసినవారికేస్వర్గమున సూర్యానుగ్రహమువలనస్థానము లభించుచున్నది.దానము చేసినవారేమరణములేనివారు అగుచున్నారు. దానముచేసినవారే ఆయువునుపొందుచున్నారు.

7. దేవతలనుతృప్తి పరచువారలకుపాపము కలుగదు. దేవతలనుస్తుతించువారు, వ్రతములుచేయువారికి వార్ధక్యమురాదు. ఈ ముగ్గురు కానివాడుపాపముల పాలగును.దేవతలకు యాగములుచేయనివారు కష్టములపాలగుదురు.

## నూటఇరువది ఆరవ సూక్తము

## ఋషులు-మొదటి5-కక్షీవంతుడు; 6-బాయవ్యుడు;7-రోమశ అను మహిళ;దేవత- దానము,ఛందస్సు-తొలి 5 త్రిష్టుప్,ిగిలినిి అనుష్టుప్

**1.స్వనయుడు సింధుదేశపు రాజు. అతనినిఅన్యులు హింసించలేరు.అతడు నాకు వేయి సోమయాగములకీర్తిని కలుగజేసినాడు.అట్టి రాజు కొిఅకుసుమనస్కుడనయిమంచి స్తుతులనుకూర్చుచున్నాను.**

2. స్వనయుడుధనదాత. అతనినినేను యాచించినాను.అతడు కక్షీవంతుడనునాకుఅతని సమస్త ఆభరణములనుఇచ్చినాడు. స్వీకరించినాను.ఆిధముగా స్వనయునికీర్తి ద్యులోకమునశాశ్వతము అయినది.

3. స్వనయుడుకపిలాశ్వములు పూన్చిన,స్త్రీలు కూర్చున్నపది రథములనుఇచ్చినాడు. అరువదివేలకుంంచిన గోసముదాయమురథములవెంటసాగినది. కక్షీవంతుడుమరుసటి రోజేవాటిని అన్నింటినితన తండ్రికిఅర్పించినాడు.

4. పదిరథములు వేయిమంది సేవకులు గల గోసమూహముముందు నలుబదిఎర్రగుఱ్ఱములువరుసకట్టిసాగినం.తదుపరి కక్షీవంతుని సేవకులు గడ్డి మొదలగువానితో సాగినారు.

5. మాబంధువులుఅన్యోన్య అనురాగముగలవారు. ఐకమత్యముగలవారు. హంస్సులనుఇచ్చువారు. అంగిరస వంశస్థులు.మొదటి దానమునుఅనుసరించి ధనమునిండిన పదకొండురథములను బంధువులకొఱకు గ్రహించినాను.

6. నాభార్యరోమశ సంభోగార్హురాలు.నేను ఆమెని ప్రియముగాపరిగ్రహించినాను.బిడ్డను కన్నముంగిసవలె ండువరానిది.ఆమె నాకు అనేక సంభోగములనుఇచ్చుచున్నది.

7. నాధా!నేను గాంధార దేశపుగొఱ్ఱెవలె రోమములుకలిగి, సంపూర్ణరాలనయిఉన్నాను. నా అవయవములుఅల్పములు అని తలంచకుము.నన్ను సంపించుము.నన్ను తాకుము.

(ప్రథమమండలమునపదునెనిందవ అనువాకముసమాప్తము)

## పందొంమ్మిదవఅనువాకము-నూటఇరువది ఏడవ సూక్తము
## ఋషి-పురుచ్ఛేపుడు,దేవత-అగ్ని, ఛందస్సు-అత్యష్టి

1. అగ్నియజ్ఞనిర్వాహకుడు,దేవతలనుపూజించువాడు. సమర్థుడు.హోమము చేయునపుడు నేతిహంస్సుల సహితముగజ్వలించువాడు.అగ్ని గొప్పదాత. సకలజనులజీవహేతువు. బలమునకుపుత్రుడు, ప్రజ్ఞావంతుడు.ంప్రునివంటి మేధాం.దేవతలనుఆహ్వానించువాడు.అట్టి అగ్నిని స్తుతించుచున్నాను.

2. అగ్నీ!నీవు మేధాంం. ప్రకాశవంతుడవు.అంగిరో వంశజులందుఉత్తముడవు.సర్వత్ర సంచరించువాడవు.సూర్యుని పోలినవాడవు.మానవుల కొఱకుదేవతలనుపిలుచువాడవు.జ్వలించువాడవు.కామ్యార్థప్రదాతవు.అత్యంత పూజార్హుడవు.మేము ఋత్విజులమునిన్ను మంత్రములతోఆహ్వానించుచున్నాము.యజమానులకోరికలు తీర్చుము.

3. అగ్నిసంయోగము కఠినములు,స్థావరము అయిన పర్వతాదులుద్రంచును. అగ్నిప్రకాశమానుడు. పరశుప్రహారమువలెశత్రువును తెగనరుకువాడు.ంలుకానివలె అగ్నిశత్రువును తిరస్కరించింహరించుచున్నాడు.పారిపోవువాడుకాదు.

4. దాతలుపరమార్థవేత్తకుధనములు సమర్పింతురు.అట్లే యజమానులుఅగ్ని కొఱకు రసవంతములగుహంస్సులు అర్పించుచున్నారు.అగ్ని అత్యంత తేజోవంతుడుయజమానులకుస్వర్గాదులు ప్రసాదించుచున్నాడు.అగ్ని అనేక వస్తువులందువృక్ష సమూహములందుప్రవేశించుచున్నాడు.తన జ్వాలలతోవాటిని మసి చేయుచున్నాడు.అదేంధముగా అగ్నితేజమునపాపములను నిశ్శేషముగానశింపచేయుచున్నాడు.

5. పగలుకన్నఅగ్ని రాత్రి ప్రకాశమానమయిప్రజ్వరిల్లును.దర్శనీయుడగును.ఆయుష్మంతుడగు అగ్నికొఱకు పగలు యజ్ఞవేదికసంపమున హంస్సులుఅర్పింతుము. తండ్రిగృహమును పుత్రుడుపూజించువారిని రక్షించుచున్నం.అగ్ని హంస్సులుఅందుకొని ముదింలేనివాడుఅయినాడు. అతడు యజమానులనుముదించెందనీయడు.

6. వేదికలందుమరుత్తుల బలమువలె,అగ్ని అధికధ్వనితోప్రజ్వరిల్లుచున్నాడు.అగ్ని పూజనీయుడు.సేనా ంజయమునకుఅర్చింపదగినవాడు.హంస్సులు స్వీకరించుస్వభావము

కలవాడు.యజ్ఞ ప్రకాశకుడు.ఆహుతులకుఆనందించువాడు.యజమానులకుఆనందప్రదాత. మానవులసుఖప్రాప్తి కొఱకు మంచిమార్గమును అనుసరించినట్లుఅగ్నిని అనుసరించుచున్నారు.

7. భృగువంశజులయినఋషులు ఐహిక,ఆముష్మిక ప్రాప్తి కొఱకుఅగ్నిని నుతించుచున్నారు.నమస్కరించుచున్నారు.హంర్దానముకొఱకు అరణిని మధించుచున్నారు.పాపరహితులుఅగుచున్నారు. హోమద్రవ్యములధరించి జ్వలించునట్టిఅగ్ని రత్నదాత అగుచున్నాడు.యాగప్రధానుడగుఅగ్ని కొఱకు ఆజ్య యుక్తములయినహంస్సులనుఅందించుచున్నాము.ప్రజ్ఞావంతుడగుఅగ్ని ఈ హంస్సులను,ఇతర హంస్సులనుఅందుకొనుచున్నాడు.

8. అగ్నిసమస్త జనులకుసమస్త యజమానులకుపాలకుడు. స్తవనీయుడు.అతిధివలెపూజార్హుడు. అట్టిఅగ్నిని సుఖములుప్రసాదించమని ఆహ్వానించుచున్నాము.అన్నాదులు అందుకొనుటకుపిల్లలు తండ్రివద్దకుచేరుదురు. అట్లేదేవతలందరుహంస్సులకొఱకుఅగ్నివద్దకు చేరుదురు.ఋత్విజులుసహితము పూజనీయులయినఅన్యదేవతలమధ్య అగ్నికే హంస్సులుఅందించుచున్నారు.

9. అగ్నీ!నీవు బలవంతుడవు.శత్రుంజయుడవు.తేజోవంతుడవు.దేవతలు మెచ్చదగుయజ్ఞము ధనమునందువలెనీవు అరణులందుఆంర్భంంచుచున్నావు.నీ కార్యములు కీర్తిప్రదములు.నీ ఆనందమే ప్రధానము.అందువలన యజమానులునిన్ను పరిచారకులవలెసేంంతురు.

10.ఋత్విజులారా!పూజ్యుడు, స్వబలమునఇతరులను తిరస్కరించువాడు,ప్రాత:కాలమునప్రజ్వరిల్లువాడు,పశుప్రదాత అగు అగ్నిని స్తుతించుడు.అగ్ని కొఱకు యజమానిసమస్త వేదికలనుఏర్పరచుచున్నాడు.యజ్ఞమునకుంచ్చేయు దేవతలందుఅగ్నియే శ్రేష్ఠుడు.స్తోత్ర పాఠకులు ధనికునిస్తుతించునట్లుహోతలు అన్యదేవతలకన్నముందుగా అగ్నిని స్తుతింతురు.

11.అగ్నీ! మాకు కనిపించు దేవతలందరకునీవు సమానుడవు.నేను మంచిమనసువాడను.నీవు మంచి మనసుతోపూజనీయము అగు ధనమునునాకు ప్రసాదించుము.అగ్నీ! నీవు బలవంతుడవు.నీవు మా కొఱకును,స్తుతికర్తలకొఱకును,యజమానులకొఱకును‌శ్రేష్ఠమయిన అన్నమునుఅనుగ్రహింపుము.

అగ్నీ!నీవు ధనవంతుడవు.మాకు మంచి పుత్రపౌత్రులను,ధనమును ప్రసాదించుము.కఠినుడు తన బలమునఇతరులను నశింపచేయును. అట్లేనీ బలమున మాశత్రువులనునశింప చేయుము.

## నూటఇరువది ఎనింందవసూక్తము

## ఋషి-పురుచ్ఛేపుడు,దేవత-అగ్ని, ఛందస్సు-అత్యష్టి

1. అగ్నిఇతర దేవతలనుఆహ్వానించువాడు.అరణుల మధ్య,అధ్వర్యుని వలనఅవతరించినవాడు.సకల కర్మలకు ఆధారభూతుడు.యజమానులుధనమును ఆపేక్షించిఅగ్నిని అర్చించుచున్నారు.యజమానులకర్మలు, స్వకర్మలనుఅనుసరించి ప్రవర్తించుఅగ్నియొక్క మైత్రియేయజమానులకుసంపద అగుచున్నది.వేదికంంద ప్రజ్వరిల్లుఅగ్నిని బాధించువారులేరు. ఆ అగ్ని చుట్టుఋత్విజులుచేరి ఉన్నారు.

2. అగ్నియజ్ఞ సాధకుడు.యజ్ఞవేదియందుప్రతిష్ఠింపబడినవాడు.ఆ అగ్నికి యజ్ఞమునందలిపురోడాశాదులు తృప్తికలిగించువరకు సేంంతుము.పూర్వము వాయువు ఈ అగ్నినిసూర్యుని నుండి మనువుకొఱకు భూంకి తెచ్చినాడు.అట్టి అగ్ని మా యజ్ఞశాలయందుఉండవలెను. చరుపురోడాశములుగ్రహించువరకుప్రజ్వరిల్లుచుండవలెను.

3. మాఆహ్వానమునుఅందుకొని ంచ్చేయువాడు,వేదికంద స్తుతించబడువాడు,హంస్సులు కలవాడు,కోర్కెలు తీర్చువాడు,ధ్వనించువాడు, సమర్థుడు,ప్రకాశకుడు, స్తుతులకునూరురెట్లు ఎదిగిజ్వలించువాడు,శత్రుహంతకుడు,ఉన్నత స్థలములందు,యజమాని గృహముననివసించు అగ్ని గమనముతోహంస్సులనుఅందుకొనుటకు సాగుచున్నాడు.

4. అగ్నిమహత్కర్మలవాడు.పురోహితునివలెయజ్ఞనిర్వాహకుడు,ఇంటింటా నశించకనిలుచువాడు, యజ్ఞములందుంరాజిల్లువాడు, ఈ యజమానియుసత్కర్మతో యాగముచేయుచున్నాడు.యజమానికి ఫలమునుప్రసాదించుటకు అగ్నిహంస్సులు స్వీకరించుచున్నాడు.అగ్ని ఆజ్యము అతిథివలెపూజ్యుడు అయినట్లేయజమానియు హంస్సులుఆర్జించుచున్నాడు.

5. అగ్నితన తృప్తి కొఅకువాయువు ధాన్యాదులనుతనలో చేర్చుకొనును.అట్లే యజమానులుఅగ్నిని తృప్తి పరచుటకుఅగ్ని జ్వాలలందుచరుపురోడాశాదులు సమర్పించుచున్నారు.అన్నము కోరువానికి ఆహారముసమకూర్చువానివలెయజమానులుఅగ్నికి హంస్సులుఅందించుచున్నారు.ఆ అగ్ని మమ్ము పాపములనుండి రక్షించుచున్నాడు.పాపబాధను తొలగించుచున్నాడు.

6. అగ్నిసర్వస్వరూపుడు. మహత్తుగలవాడు.అతృప్తుడు. అతడుకుడిచేత ధనమునుదాల్చినాడు. సూర్యునివలెప్రకాశించుచున్నాడు.అన్నము అర్థించువారినిండుచువాడుకాడు.అతడుదేవతలకు హవ్యవాహనుడు.అగ్ని యజమానులుఅందరికి అన్నము కలుగచేయును.పుణ్యలోకములద్వారములు తెరుచును.

7. అగ్నియజమాని పాపములుతొలగించును. బాధలుదూరము చేయును.సుఖములు కలిగించును.అతడు ఋత్విజులకుపాలకుడు. జయశీలుడగురాజువలె ఇష్టుడు.యజమానులుఅందుంచు హంస్సులకొఅకుఅగ్ని ంచ్చేయును.ఘనుడు, హింసకుడు,అయిన వరుణ రాజుబాధలనుండిఅగ్ని రక్షించుచున్నాడు.

8. అగ్నిధనములనుఇచ్చువాడు. అందువలనజనప్రియుడు,అగ్ని అధిపతి. హోమనిర్వాహకుడు.హవ్యవాహనుడు.జీవన సర్వజ్ఞుడు.ధ్వనించువాడు. మనోహరుడు.అట్టి అగ్నిని ఋత్విజులుతమ రక్షణ నింత్తముధనములు కోరుచుహంస్సులు అర్పించిస్తుతించుచున్నారు.

## నూటఇరువది తొంమ్మదవసూక్తము

### ఋషి-పురుచ్ఛేపుడు,దేవత-ఇంద్రుడు,6వ దానికి చంద్రుడు,ఛందస్సు-అత్యష్టి8,9 అతిశక్వరి 11 అష్టిభ

1. ఇంద్రా!నీవు ప్రజ్ఞావంతుడవు.పండితుడవు. యజమానిచేయు యజ్ఞమునకునీ రథమును నడిపించుచున్నావు.అతనిని గొప్పవానిని చేయుచున్నావు.ఫలములు పొందుటకుసమర్థుని చేయుచున్నావు.హంస్సు కలవానినిచేయుచున్నావు.హంస్సులు కోరుచున్నావు.కర్మ ఫలము ప్రసాదించుటకుఆలస్యముచేయనిఇంద్రుడు మా హంస్సులను,స్తుతులను స్వీకరించవలెను.

2. ‘‘ఇంద్రా!రక్షింపుము’’ అను పిలుపుంన్నపుడు నీవు మరుత్తులతోకూడి యుద్ధములకుపోవుచున్నావు.నీ సేనలతోకూడి నీవేనరులకు అభయముఇచ్చుచున్నావు.ఋత్విజులతోకూడిఅన్నము ప్రసాదించుచున్నావు.హంస్సులు అందుకొనుచున్నావు.అటువంటి నిన్నుఋత్విజులుస్తుతించుచున్నారు.వేగవంతమగు గుఱ్ఱమునువలెనిన్ను సేంంచుచున్నారు.

3. ఇంద్రుడుశత్రుంజయుడు.నీరులేని మేఘములనుండిచి, నీరు నిండినమేఘములను కొట్టివర్షించువాడు. ఇంద్రుడువర్షింపచేయుటఅసామాన్య కార్యమనిజనులకు చాటిచెప్పుచున్నాను.ఇంద్రుని గొప్పతనమునుద్యులోక దేవతలకు,రుద్రునకు, ంత్రునకు,వరుణునకు చెప్పుచున్నాను.ప్రజలకు సుఖముకలిగించు ఇంద్రునకుసహితము ంన్నంంచుచున్నాను.

4. ఇంద్రుడుయాగముల ని◌ిత్తముస్నేహితుడయివచ్చువాడు. శత్రువునుసహించువాడు.సహాయము చేయువాడు.హ◌ిస్సుల కొఱకుయాగ ◌ిరోధులనుఅణచువాడు. మరుత్తులతో కూడినవాడు.ఫలములను ఇచ్చుఇంద్రుని మా సమస్తకర్మములను రక్షించుమనిప్రార్థించుచున్నాను.ఇంద్రుడు నివారించినశత్రువు మమ్ముఏ యుద్ధములందునుబాధించలేడు.

5. ఉగ్రుడవగుఇంద్రా! నీకు భక్తుడయినయజమాని నీ శత్రువులయినవృత్రాదులనువలెఆయుధములతోను,యాగధనముతోనులొంగదీయుము. మాపూర్వులకునీవు యాగఫలమును ప్రసాదించినావు.మాకును అట్లే నీరక్షణలను,యాగఫలమును ప్రసాదించుము.నీవు పాప రహితుడవు,జగన్నిర్వాహకుడవు.అది జగద్వితము.మా యజమాని సకలపాపములను తొలగించుము.దు:ఖములనుపరిమార్చుము. సుఖములుప్రసాదించుము.

6. మేముచంద్రుని ఆహ్వానించుచున్నాము.యాగ◌ిరోధులనుహింసించి ఇంద్రునివలెచంద్రుడు వచ్చుచున్నాడు.దినదినాభివృద్ధినొందు చంద్రునిస్తుతించుచున్నాము.మమ్ము నిందించువానిని,◌ిరోధిని, దుర్బుద్ధిగలవానిని చంద్రుడుతొలగించవలెను.మమ్ము హింసించదలచినదొంగను తలక్రిందులుగావ్రేలాడదీసి రూపుమాపవలెను.

7. ఇంద్రా!ప్రసిద్ధమగు నీరూపమునుతెలుపుచున్నాము.స్తుతించుచున్నాము.భజించుచున్నాము.సామర్థ్యము కలిగించునది,రమణీయమగునది,వృద్ధినొందునది,పుత్రపౌత్రాదులతోగూడినది అగు ధనమునుప్రసాదించుమని ప్రార్థించుచున్నాము.ఇంద్రా! నిన్ను తెలిసికొనుటదుస్తరము. నీకు హ◌ిస్సులుఅర్పించుచున్నాము,ఆహ్వానించుచున్నాము,అర్చించుచున్నాము.

8. ఋత్విజులుమా పక్షమున ఇంద్రునిస్తుతించినారు. ఇంద్రుడుప్రసన్నుడు అయినాడు.యుద్ధమునందుశత్రువులనుకూల్చినాడు. ఇంద్రుడుశత్రునాశకుడు. అతనిపాలనలో మమ్ముఎదిరించ వచ్చినసేన తానే చచ్చినది.మా ◌ిదకు రానేలేదు.

9. ఇంద్రా!నీవు పాపములు, రాక్షసులుఉండని మార్గమునరమ్ము. తలచినంతనేకలుగు ధనములతో◌ిచ్చేయుము. దూరమగుస్వర్గమునుండి రమ్ము.దగ్గరి భూలోకమునుండి ◌ిచ్చేయుము.యాగశాలలోని హ◌ిస్సులనుస్వీకరింపుము. యాగమును,మమ్ము రక్షింపుము,పాలింపుము.

10.ఇంద్రా! నీవు బలవంతుడవు.ధనవంతుడవు.రక్షకుడవు. అసురుడవు.తృప్తి కలిగించువాడవు.మాస్తుతులు నిన్నుమరింత బలవంతునిచేయును. నీ మహాత్మ్యమువృద్ధినొందించును.ఉత్సాహము కలిగిసూర్యునివలె ప్రకాశింతువు.నీవు ఏదో ఒక రథమునుఅధిరోహించిమా యాగశాలకు ◌ిచ్చేయుము.శత్రువును బాధింపుము.కుత్సితుని హతమార్చుము.

11.ఇంద్రా! నీవు రక్షకుడవు.మమ్ము దుర్బుద్ధి,పాపములనుండి రక్షింపుము.మా స్తుతులతోతృప్తినొందుము.యాగ ◌ిఘ్నకారకులనుహతమార్చుము.మావంటి యజమానులనురక్షింపుము. సకల జీవములకుఆధారభూతుడవగునిన్ను రాక్షస సంహారమునకుగానుపరమేశ్వరుడు సృష్టించినాడు.

## నూటముప్పదియవ సూక్తము

ఋషి- పురుచ్ఛేపుడు,దేవత - ఇంద్రుడు,ఛందస్సు - అంత్యష్టి- చివరిది త్రిష్టుప్

1. ఇంద్రా!అగ్నియాగ గృహమునకువచ్చునట్లురేరాజు చంద్రుడుస్వస్థానమునకు చేరునట్లునీవు స్వర్గము నుండియాగశాలకు ◌చ్చేయుము.పుత్రులు తండ్రినిభోజనమునకుపిలిచినట్లుఋత్విజులతోకూడి నిన్ను హ◌స్సులుఅందుకొనుటకు ఆహ్వానించుచున్నాము.

2. ఇంద్రా!దంచి, పిండి, శోధించిసిద్ధము చేసినసోమమును జలమునునిండిన తొట్టివలెపాత్రలో ఉంచినాము.దప్పిగొన్న వృషభముబా◌వద్దకు పోవునట్లు◌చ్చేయుము. ఈ సోమమునీకు బలమును,కాంతిని, సాహసమునుకలిగించును, సూర్యాశ్వములుసూర్యుని ఆకసమున ◌హరింపచేసినట్లునీ అశ్వములు నిన్నుయాగశాలకు తోడ్కొని రావలెను.

3. సోమముద్యులోకము నుండితేబడినది.నాశరహితమయినది.పిట్ట పిల్లనువలెరాళ్లమధ్యపొదలలో తీవలందుభద్రపరచబడినది.అంగిర శ్రేష్ఠుడు గోద్వారమునువలెఇంద్రుడు ఆ సోమముకొఅకు ◌చ్చేసినాడు.జలములు దాచుకున్నజలదములద్వారములను తెరచినాడు. భూ◌నిసస్యశ్యామలముచేసినాడు.

4. ఇంద్రుడుతాను ధరించినవజ్రాయుధమునుశత్రుసంహారమునకుగానుజలమును మంత్రములతోతీవ్రపరచినట్లుసానపట్టుచున్నాడు.వృత్రాసురుని వధించుటకుపదును పెట్టుచున్నాడు.ఇంద్రుడు ససైన్యముగాబయల్వెడలినాడు.చెట్లను గొడ్డలితోవలెశత్రువులననరికినాడు.గంఢ్రగొడ్డలితోచెట్లను కూల్చినట్లుశత్రువులనుకూల్చినాడు.

5. ఇంద్రా!యుద్ధమునకువెడలువారి వలెనీ రథమును మాయాగములకు నడిపింతువు.వర్షము కలిగించినదులను సముద్రమునకుప్రవహింప చేతువు.మనువునకు గోవులనుఇచ్చినట్లు సామాన్యజనులకు గోవులనుఅందించినావు. మమ్ముకాపాడుటకు జలములనునదులందు ప్రవహింపచేసినావు.

6. ఇంద్రా!ధనము కొఅకును,సుఖము కొఅకునుఋత్విజులునీకు హ◌స్సులు అర్పించుచున్నారు.బుద్ధి కుశలుడురథమును నిర్మించినట్లుఋత్విజులునీ కొఅకు స్తుతులను నిర్మించినారు.యుద్ధములందువేగముగల నిన్నుయుద్ధ◌రుని పొగడినట్లుపొగడి ప్రోత్సహించుచున్నారు.◌శ్వమందలి గోధనాదులనుప్రసాదించమని నిన్నుప్రార్థించుచున్నారు.

7. ఇంద్రా!నీవు వజ్రమునునాట్యము చేయించగలవు.నీవు హ◌స్సులుఅర్పించు యజమానికొఅకు తొంబది శత్రునగరములను కూల్చినావు.శత్రుసంహారకమగువజ్రమున యజమానియొక్క శత్రువులనుహతమార్చినావు.దివోదాసుని కొఅకు అతనిశత్రువు శంభరాసురునికొండ◌ది నుంచి కూలద్రోసినావు.

8. ఇంద్రుడుయుద్ధములందుయజమానుని రక్షించుచున్నాడు.సమస్త యుద్ధములందు,తన ఆయుధములతో,యజమానుని రక్షించుచున్నాడు,స్వర్గ సౌఖ్యములనుఇచ్చి యుద్ధములందురక్షించుచున్నాడు.ఇంద్రుడు నదులకొఅకుగాను◌ద్వేషులను సంహరించుచున్నాడు.కృష్ణుడు అనురాక్షసుని నల్లని చర్మముఒలిచి చంపినాడు.దహించినాడు.హింసించు సర్వజంతువులనునిశ్శేషముగ హతమార్చినాడు.

9. ఇంద్రుడుసూర్యుని రథచక్రమునుతన బలమునలాగినాడు. తేజోవంతుడుఅయినాడు. శత్రువు◌ద ప్రయోగించినాడు.శత్రువులనుహతమార్చినాడు.ఇంద్రుడు ఉశనసుని రక్షించుటకుఇంతదూరము వచ్చినాడు.అతడు మాకు సమస్తసుఖసాధనములనుప్రసాదించవలెను.నరునివలె సాయపడవలెను.నిత్యము మా కోరికలనుతీర్చవలెను.

10).ఇంద్రా! నీవు వర్ధించువాడవు.శత్రుపుర ధ్వంసకుడవు.ప్రసిద్ధుడవు.మేము దివోదాస వంశజులము.నిన్ను నూతన స్తోత్రములతోభజించుచున్నాము.మా స్తోత్రములకుసంతృప్తుడవు అగుము.మమ్ము రక్షించుము.పగటి సూర్యునివలెప్రకాశించుము.

## నూటముప్పది ఒకటవసూక్తము

## ఋషి-పురుచ్ఛేపుడు,దేవత-ఇంద్రుడు,ఛందస్సు-అంత్యష్టి

1. దేవతలుఇతరులను నిరసించుస్వభావులు. అయిననుఆ దేవతలు ఇంద్రునకువశులయి ఉన్నారు. భూమికూడ ఇంద్రుని కీర్తి కొఱకు,ఇంద్రునకు వశులయిఉన్నారు. దేవతలందరుఏకముగా ఇంద్రునే ముందుంచుకున్నారు.మానవులు చేయుప్రాతస్సవనాదులుమూడును, పురోడాశాదిహవిస్సులునుఇంద్రుని కొఱకే అగుచున్నవి.

2. ఇంద్రా!నీవు సర్వసముడవు.యజమానులుతమ కోరికలు తీర్చుకొనుటకును,స్వర్గాదులు లభించుటకును,నీ ఒక్కనికే, సకల సోమయాగములందును,విశేష హవిస్సులనుఅర్పించుచున్నారు. యజమానులునిన్ను ఓడవలెదరిచేర్చు వానిగా భావించిసేనాగ్రమందు ఉండమనిఅర్థించుచున్నారు.యజ్ఞములందుఈశ్వరునివలె భావించినిన్ను కీర్తించుచున్నారు.

3. ఇంద్రా!నీవు పబ్బమునువిడవక నీ సామర్థ్యమునుప్రకటించుచున్నావు.యజమానులుగోసమూహములనుకోరి ఉన్నారు. పాపములు పోగొట్టకోదలచినారు.ఆ తలంపుతో భార్యాసహితులయినీకు హవిస్సులు ఇవ్వదలచినారు.యాగములు చేయుచున్నారు.నీవు యజమానులకుగోవులను, స్వర్గమునుప్రసాదించుము.

4. ఇంద్రా!నీవు ఎంతోకాలముగాగట్టిపడిన శత్రుపురములనుధ్వంసము చేసినావు.యాగ విరోధులగు రాక్షసులనునాశనము చేసినావు.ఈ నీ పరాక్రమమునుయజమానులుగ్రహించినారు.నీవు ఈ భూమిని, జలమునుస్వాధీనపరచుకున్నావు.సకల సంతోష కార్యములనుచేయుచున్నావు.

5. ఇంద్రా!నిన్ను భజించుయజమానులనురక్షించుచున్నావు.నీ స్నేహము కోరినమమ్ము రక్షించుచున్నావు.అందువల్ల సర్వయాగములందుననీకు బలమునుఇచ్చు సోమమునుసమర్పించుచున్నాము.యజమానులనురక్షించుటకు యుద్ధములందుసింహనాదముచేయుచున్నావు.నీకు సర్వ విషయములందునుసమృద్ధి కలదు.అన్నము కోరినవారికిఅన్నము ఇచ్చుచున్నావు.

6. ఇంద్రుడుకామ్యార్థ ప్రదాతగా-శత్రుహింసకుడుగాపేరుపొందినాడు. స్వర్గ సాధనమగుయజ్ఞమునకుఇంద్రుని ఆహ్వానించుచున్నాము.ఇంద్రుడు ఉష: కాలమునవచ్చేయునా? అర్చనసాధనములగుహవిస్సులు గ్రహించునా?

7. పరాక్రమశాలీ!ఇంద్రా ! నిన్ను మాస్తుతులతోపూజించినాము. మాయందుశతృత్వము గలవారినిమాకు దు:ఖములుకలిగించు వారిని నీ వజ్రాయుధమునహతమార్చుము.మంచి స్తోత్రములువినుము. మమ్ముజయించవలెనన్నదుర్బుద్ధి నశించవలెను.సకలమార్గములందునుదోపిడి గాండ్ర దుర్బుద్ధిమమ్ము బాధింపకుండవలెను.

## నూటముప్పది రెండవసూక్తము

## ఋషి-పురుచ్ఛేపుడు,దేవత-ఇంద్రుడు,ఛందస్సు-అంత్యష్టి

1. ఇంద్రా!నీవు మాకు రక్షకుడవు.నీవు మాకు సాయముచేయుము. మేముఎంతటి శత్రువునైననుఎదిరించగలము.మాెదకు వచ్చువారినిహతమార్చగలము.యజ్ఞమునందుసోమము సమర్పించినయజమానికి మేలుచేయుము. యుద్ధములందుశత్రుంజయుడవయిననీకు హంస్సులు అందించుచున్నాము.స్తుతించుచున్నాము.

2. శత్రువులనుసంహరించదలచినయజమాని ిరమార్గమునుఅవలంబించుచున్నాడు. ఇంద్రునకుప్రీతి కలిగించుటకుప్రాతస్సవనముచేయుచున్నాడు.స్వర్గప్రదాత అగు ఇంద్రుడుఆ యజమాని శత్రువులనుహింసించుచున్నాడు.అన్నీ తెలిసినయజమానికి ఇంద్రుడుపూజనీయుడు. అట్లేఇంద్రుడు సర్వజనులకుపూజనీయుడు అగును.
ఇంద్రా!మాకు సంపదలు ప్రసాదించుము.నీవు చేసిన దానములుస్థిరములు కావలెను.

3. ఇంద్రా!ఋత్విజులువేదికలు సిద్ధముచేయుచున్నారు.యాగములు చేయుచున్నారు.నీ కొఅకు ప్రకాశమానమగుహంస్సులు సిద్ధముచేసినారు. నీవు స్వర్గమునఉన్నావు. అంతరిక్షమునసూర్యరూపమున నిన్నుఅందరు దర్శించుచున్నారు.నీవే వర్షము కలిగించుచున్నావు.యజమానులకుగోధనమును ప్రసాదించుచున్నావు.

4. ఇంద్రా!అంగిరో గోత్రజులకొఅకు మేఘమునుభేదించినావు.వారి గోసమూహములనుడిపించినావు. అట్లేయుద్ధములుచేసినావు. జయించినావు.మేము నీకు సోమమునుసమర్పించుచున్నాము.నీపనులు పూర్వమువలెనేస్తవనీయములు.

5. ఇంద్రుడుపరాక్రమశాలి. అతనిిర కృత్యములు జగద్విదితములు.యజమానులుతమ శత్రువులనుబాధించుమనిఇంద్రుని అర్చించుచున్నారు.హంస్సులు అందించుచున్నారు.హంస్సులు ఇంద్రునికొరకే ఏర్పడినం. ఇంద్రుడుఅన్నము కోరిన యజమానులనురక్షించుచున్నాడు.వారి శత్రువులనుహతమార్చుచున్నాడు.యజమానులుస్వర్గమును సాధించుకర్మలు చేయుచున్నారు.దేవతలనుఅభిముఖముచేసికొనుచున్నారు.

6. మేఘాభిమానదేవతలారా! ిరుయుద్ధమునఅగ్రభాగమున నిలువుడు.మమ్ము వధించవచ్చుసేనను హతమార్చుడు.శత్రువులనుఅందరను వజ్రమునచావగొట్టుడు. వజ్రాయుధముదూరము నుంచి కనిపించదు.లక్ష్యమయిన శత్రువుెదపడికూల్చును. మా ిరోధులుఎక్కడ ఉన్నను, వజ్రమువారిని వారి ఉపాయములనుభేదించును.

## నూటముప్పది మూడవసూక్తము

### ఋషి-పురుచ్ఛేపుడు,దేవత-ఇంద్రుడు,ఛందస్సు-2, 3, 4 అనుష్టుప్,5 గాయత్రి, అధ్వతి;అంత్యష్టి

1. యజ్ఞములుచేయుచున్నాము.ద్యావా భూములనుపంత్రము చేయుచున్నాము.ఇంద్రునకు ఆశ్రయములుకాని భూములను,ఇంద్ర ద్రోహస్థానములనుకాల్చుచున్నాము.మమ్ము ఎదిరించినశత్రువులు అందరుశ్మశానము పాలయినారు.

2. శత్రుంజయుడవగుఇంద్రా! శత్రుసేనలశిరస్సులను సర్వవ్యాప్తములగునీపాదముచేతను,ఐరావతపాదముచేతనుఅణగద్రొక్కుము.

3. ఇంద్రా!శత్రుసేనలనుచూర్ణము చేయుము.పీనుగుల పెంట చేయుము.శ్మశానము చేయుము.కుత్సితము సర్వసాధారణము.దానిని తగలపెట్టుము.

4. ఇంద్రా!పైన చెప్పిన సేనలకుమూడింతల సేనలనువెంటపడి తరిిునావు.పట్టుకున్నావు. హతమార్చినావు.నీవు చేసిన శత్రుసేనావధ మహత్తరమయినది.అనల్పమయినది.

5. ఇంద్రా!ఎరుపురంగులుగల భయంకరపిశాచములను హతమార్చుము.సమస్త రాక్షసులనుహతమార్చుము.

6. ఇంద్రా!నీవు శత్రునాశకుడవు.ఘన మేఘములనుతలక్రిందులుగాచీల్చుము. వర్షములేక భూిు ఏడ్చినట్లు,త్వష్ట రూపాగ్ని భయమునద్యావా భూములుఏడ్చినట్లు యజ్ఞములులేక ద్యులోకముఏడ్చుచున్నది.

7. సోమయాగముచేసిన యజమానిగృహములుపొందుచున్నాడు. శత్రువులనుహింసించుచున్నాడు.దేవతల శత్రువులనుఓడించుచున్నాడు.అన్నము కలవాడుఅగుచున్నాడు. అపరిితధనమును పొందుచున్నాడు.ఇంద్రుడు సోమయాగముచేయువారికి సమస్తసంపదలు ప్రసాదించుచున్నాడు.

(ప్రథమమండలమునపందొిమ్మదవ అనువాకముసమాప్తము)

## ఇరువదిఅనువాకము-నూటముప్పదినాలుగవ సూక్తము
## ఋషి-పురుచ్ఛేపుడు,దేవత-వాయువు,ఛందస్సు-అంత్యష్టి

1. వాయువా!సమర్థము, వేగవంతములుఅయిన అశ్వములు నిన్నుఅందరికన్నముందుయాగమునకు తీసికొనిరావలెను.నిన్ను సంతోష పెట్టుటకువాక్కు సత్యయుతము,గుణవంతము కావలెను.యజ్ఞసంబంధములయినహిస్సులు అందుకొనుటకును,మాకోర్కెలు తీర్చుటకునురథమున ిచ్చేయుము.

2. మేముసోమము సిద్ధపరచినాము.అది శోధించబడినది.ప్రకాశించునది. నిన్నుఆనందింపచేయును.వాయువా! నీ గుఱ్ఱములు"నియుత్తులు" అనినిన్ను సేించునిపనినెరవేర్చునిి. సంతోషముకలిగించునిి. కలిసినడుచునిి. ఆ గుఱ్ఱములునిన్ను యాగస్థలమునకుచేర్చగలవు.ఋత్విజులుహిస్సులతో నిన్నునుతించుచున్నారు.

3. వాయువుఎర్రని గుఱ్ఱములనుకాడికి కట్టుచున్నాడు.చిత్రవర్ణ అశ్వములనురథమునకు పూన్చుచున్నాడు.జారుడు పరస్త్రీని మేల్కొలిపినట్లువాయువా! యజమానినిమేల్కొల్పుము. ఉషస్సులనునిలుపుము. ద్యావాపృథ్వులనుప్రకాశింపజేయుము.

4. వాయువా!ప్రకాశించు ఉషస్సులు నీకొఱకు అంతరిక్షమునఆవరించిన తమకిరణములచేతవస్త్రములు ిస్తరించుచున్నిి.నానావర్ణ వస్త్రములనుపరచుచున్నిి. గోవునీ కొరకే పాలు, నేయి మున్నగువానిని ఇచ్చుచున్నది.వర్షము కలిగించువాయువులను కలిగించుచున్నావు.నదులను ప్రవహింపచేయుచున్నావు.

5. వాయువా!పిత్రులగు యజమానులుయాగములందు నీకొఱకు సోమమును సిద్ధపరచినారు.నిన్ను వర్షము కలిగించమనిప్రార్థించుచున్నారు.నీవు సమస్త భూతముల నుండిహిస్సులు అందుకొనుచున్నావు.సర్వభూతములనురాక్షస బాధనుంచిరక్షించుచున్నావు.వ్రతములచేక్షీణించిన యజమానియాగిరోధులనుపారదోలవలసినదనినిన్ను ప్రార్థించుచున్నాడు.

6. వాయువా!నీకు సోమపానమునఅగ్రస్థానము కలదు.సోమపానమునకుఅర్హుడవు. నీవు పాపములుపోగొట్టువాడవు.యజమానులునిన్ను ిశేషముగ ఆహ్వానించుచున్నారు.సమస్త గోవులు నీకొరకే పాలు, నెయ్యి మున్నగునిిఇచ్చుచున్నిి.

## నూటముప్పది అయిదవసూక్తము

ఋషి-పరచ్ఛేపుడు,దేవత-వాయువు,ఇంద్రుడు-ఛందస్సు-7,8,అష్టి; ిగిలిని అత్యష్టి

1. వాయువా!దర్భలు పరచినాము.సోమము సిద్ధముచేసినాము. నూర్ల,వేల అశ్వములతోిచ్చేయుము. నీకొఅకుఋత్విజులుఇతర దేవతలకంటే ముందు సోమముసమర్పించినారు. ఈ సోమమునిన్ను ఆనందపరచుట కేఅయి ఉన్నది. ఋత్విజులనుండిసోమము అందుకొనుముఆస్వాదించుము.

2. ఈసోమము పింత్రముతోసంస్కరించినది. కోరదగినది.నిర్మల కాంతులుకలది. వాయువా! ఈ సోమమునీకు తగినది. మనుష్యులమధ్య పొందదగినదినీకు దేవతలమధ్య సమర్పించినాము.నీవు నియుత్తుఅను గుఱ్ఱములుపూన్చిన రథమునందుిచ్చేయుము. మాతోకూడుము. తృప్తినొందుము.స్వర్గమునకు చేరుము.

3. సోమముసూర్యోదయమునందుసమాన కాంతి కలిగిఉన్నది. శుద్ధమయినది.ప్రకాశమానము అయినది.అధ్వర్యులు దానినిపట్టుకొని నిలిచినారు.వాయువా! నీకు హిర్భాగముఅందించు సమయముఅయినది. నీవు నూర్లకొద్ది,వేలకొలది అశ్వములతోిచ్చేయుము. హిస్సులుఆరగించుటకు ఆతురతగాిచ్చేయుము.

4. నియుత్తులనుఅశ్వములు పూన్చినరథమువాయువును, ఇంద్రునిసోమముచరుపురోడాశులు సేించుటకుతీసికొని రావలెను.ఇంద్రవాయువులారా!ఇతరదేవతలకన్నముందు సోమముసేించుట ీకు ప్రియము.అందువలన సోమముసేించుటకు అందరికన్నముందుగవాదిసంపదలతోిచ్చేయుడు.

5. ఇంద్రవాయువులారా!ఈ యజ్ఞమునిమ్ము స్తుతించుచున్నాము.ీ కొఅకు అశ్వవేగమంతటితీవ్రమయినసోమమును శోధించినాము.ఈ యజ్ఞమునకుసర్వ రక్షణలతో ిచ్చేయుడు.దంచి, పిండిన సోమమునుఅధ్వర్యులు అందించుచున్నారు.స్వీకరింపుడు, సేింపుడు, అన్నముప్రసాదించుడు.

6. మేముకర్మలు చేయుచున్నాము.ఆ కర్మలందు ఇంద్రవాయువుల కొఅకుదంచిపిండిన సోమముసిద్ధపరచినాము.అది ప్రకాశించునది.వెంట్రుకలు పడనిది,శుద్ధమయినది.లోపరహితము.అట్టి సోమమునుఅధ్వర్యుడు పట్టుకొనిఉన్నాడు.

7. వాయువా!సోమము దంచుధ్వని ినిపించు చోటికియజ్ఞ గృహములస్తుతివాక్కులు ినిపించుచోటికిహోమము కొఅకునేయి తీసికొనిపోబడుచున్నచోటికి నిద్రించుయజమానులనుదాటుకొని ిచ్చేయుము.ఇంద్రుడు కూడ ిచ్చేయవలెను.నియుత్తులనుఅశ్వములీద యజ్ఞస్థలమునకుీరిద్దరు ిచ్చేయుడు.నీవును ఇంద్రుడుయాగములకు ిచ్చేయుడు.

8. యజమానులుసోమమును సేకరించుచున్నారు.ఋత్విజులుయాగము నిర్వహించుచున్నారు.ఇంద్ర వాయువులారా!ఈ యజ్ఞమునందేసోమరసపు ఆహుతినిగ్రహించుడు.ఈ యజ్ఞమునందురోగములేనిి దొంగలించరానినిఅయిన గోవులు ీ కొఅకుపాలు ఇచ్చుచున్ని.యవాది ధాన్యములతోపురోడాశము చేయబడినది.ఈ యజ్ఞమునందేఆహుతి గ్రహించుడు.

9. వాయువా!నీ అశ్వములు బలముగలి. వృద్ధిపొందుని.ఆబోతులవంటిి.అి నిన్ను ద్యావాపృథ్వులమధ్యభాగముననిలుపుచున్ని.అి అంతరిక్షమున కూడఎక్కడ నిలువక వేగముగానడువగలి. అి సూర్యకిరణములవలెనిలుపశక్యముకానివైనిన్ను నిలుపుచున్ని.

## నూటముప్పది ఆరవ సూక్తము

ఋషి-పురుచ్ఛేపుడు,దేవత-రుద్రుడు,ిత్రావరుణు; ఛందస్సు-అత్యష్టి,చివరిది త్రిష్టుప్

1. ఋత్విజులారా!◌త్రావరుణులుసనాతనులు. యజమానికిసుఖప్రదాతలు.రుచిక రములయినహ◌స్సులనుప్రియముగా భక్షించినారు.వారి కొఱకు మెచ్చదగుసూక్తమును పూజ్యమగుహ◌స్సును సిద్ధపరుచుడు.

◌త్రావరుణులుప్రకాశించువారు. శ్రేష్టురాలయినఉషోదే◌ అందములనడకఅగుపించినది. సూర్యునిమార్గము కిరణములచేతదర్శనీయమయినది.◌త్రుని స్థానమగుఅంతరిక్షము వెలుగులతో◌రాజిల్లినది.వరుణుని స్థానమునకుకూడ కిరణములుచేరిన◌. అందువల్లవారు స్తోత్రార్హమగు హ◌స్సునుధరించుచున్నారు.

2. సంచారస్వభావము కలిగి,శ్రేష్టురాలయిన ఉషోదే◌అందములనడకఅగుపించునది. సూర్యునిమార్గము కిరణములచేతదర్శనీయమయినది.◌త్రుని స్థానమగుఅంతరిక్షము వెలుగులతో◌రాజిల్లినది.వరుణుని స్థానమునకుకూడ కిరణములుచేరిన◌. అందువల్లవారు స్తోత్రార్హమగు హ◌స్సునుధరించుచున్నారు.

3. యజమానివెలుగులు కలిగిసర్వలక్షణ సమన్వితమయినఉత్తరవేదిని శుభ్రముచేయుచున్నాడు.యాగము నిర్వహించబడుఉత్తరవేదిని నిత్యము◌త్రావరుణులుఆశ్రయించుచున్నారు.ప్రతి నిత్యముమేల్కొలుపువారును,ప్రకాశవంతులును,అదితి పుత్రులును,ఇష్టదాతలును అయిన◌త్రావరుణులుఅచట శక్తిని పొందుచున్నారు.అర్యముడు ఆ ఇద్దరిమధ్య ఉండి జనులనుపనులకు పురికొల్పుచున్నాడు.జనుల బట్టిపరలోకమును చేర్చుచున్నారు.

4. హోమమునందున్నఈ సోమము ◌త్రునకుప్రియము కావలెను.ఇది ◌త్రావరుణులుతలవంచుకునిత్రాగునది. యజమానులలోప్రకాశించునది. సర్వదేవతలుయజమానిని అతని కర్మలనుఅనుసరించి రక్షించును.యజమాని ఏ దేవతలనుస్తుతించునో వారుఅతనిని రక్షింతురు.

5. ◌త్రావరుణులను సే◌చి హ◌స్సులుఅర్పించు మర్త్యుడగుయజమానిని వారుపాపములనుండి రక్షింతురు.అర్యముడు సహితముసన్మార్గవర్తనుడగుయజమానిని అతనికర్మలను అనుసరించిరక్షించును. యజమానిఏ దేవతలనుస్తుతించునో వారుఅతనిని రక్షించును.

6. మహత్తుగలిగిప్రకాశించు సూర్యునకునమస్కారము. ద్యావాభూములకు నమస్కారము.◌త్రావరుణులకునమస్కారము. సుఖప్రదాత,ఇష్టఫలదాత రుద్రునకునమస్కారము. హోతా!ఇంద్రుని, అగ్నిని, అర్యముని,భగుని చేరి స్తుతింపుము.చిరంజీవులమగుమేము సంతతి కలిగిఉండవలెను. సోముడుమమ్ము రక్షింపవలెను.

7. ఇంద్రుడుమమ్ము అనుగ్రహించినాడు.కీర్తివంతులగు మమ్ముఅనుగ్రహించినారు.అగ్ని, ◌త్రుడు, వరుణుడుమాకు సుఖములుప్రసాదించినారు. అన్నవంతులమగుమేము ఆ వరములనుఅనుభ◌చగలము.

(శ్రీమదాంధ్రవచనఋగ్వేద సంహితప్ర. మండలముఱెండవ అష్టకము మొ.అధ్యాయము సమాప్తము)

రెండవఅధ్యాయము నూట ముప్పదిఏడవ సూక్తము

ఋషి-పురుచ్ఛేపుడు,దేవత-◌త్రావరుణులు,ఛందస్సు-అతిశక్వరి

1.సోమమును దంచిరసము తీసినాము. సోమరసమునపాలు కలిపినాము. ఇది◌క్కిలి మాదకము.ప్రకాశించువారు ద్యులోకవాసులగు◌త్రావరుణులుయజ్ఞమునకు◌చ్చేయవలెను.పాలు, నీరు కలిసిన ప్రకాశవంతమగుసోమమును స్వీకరించవలెను.మమ్ము రక్షించవలెను.

2. అగ్నిప్రగల్భుడు. హోమనిష్పాదకుడు.హర్షయుత.ప్రకృష్ట జ్ఞాన విశిష్టుడు.అగ్ని యజ్ఞమునప్రజల మధ్యనస్థాపితుడు అగును. అతడుఉదయసూర్యునివలెఊర్ధ్వముఖుడు అగును.స్తంభమువలెద్యులోకమువిదధూమము ధరించును.

3. సంయతము,పురాతనమగు జుహువుఘృతపూర్ణమయినది.యజ్ఞమునుపొడిగించు అధ్వర్యగణములవారుప్రదక్షిణ చేయుచున్నారు.ఆక్రమకారియు, పదునైనదియునగుకుఠారము పశువులవద్దకుసాగుచున్నది.

4. కుశములువిస్తృతములయినపుడుఅగ్ని సమిద్ధమయినపుడుఉభయులనుసంప్రీతులను చేయుటకుఅధ్వర్యులు నిలిచెదరు.హోమ నిష్పాదకుడు,పురాతన అగ్ని స్వల్పహవ్యమునుకూడ బోలెడు చేయును.పశుపాలకులవలెపశువుల చుట్టుమూడు మారులు తిరుగుదురు.

5. అగ్నిహోత, హర్షదాత,అభీష్టవర్షి, యజ్ఞవంతుడు.అగ్ని పరిమిత గతులతోపశువుల నాలుగువైపులతిరుగును. అగ్ని దీప్తిసమూహము. అశ్వమువలెనలువైపుల పరువులిడును.అగ్ని ప్రదీప్తుడయినపుడుసమస్త భూతములుగడగడలాడును.

6. హేసుందర జ్వాలా విశిష్టఅగ్నీ! నీవు భీతిజనకుడవు. సర్వత్రవ్యాపకుడవు. నీ మనోహరమగుకళ్యాణమూర్తి చక్కగాదర్శనమిచ్చును.రాత్రి తన అంధకారబలమునునీ తేజస్సును నివారింపజాలదు.రాక్షసాదులు నీ దేహముపాపమున ఉంచజాలరు.

7. వర్షముకలిగించు వైశ్వానరా!నీ వెలుగులనుఎంతటివాడునునివారింపజాలడు. మాతాపితృస్వరూపులగు ద్యావాపృథ్వులుఅగ్నిని పంపుటలో అంతసమర్థులుకారు. అట్టిఅగ్ని శోధకుడయి, తృప్తుడయిమానవుల మధ్యనప్రదీప్తుడు అగుచున్నాడు.

8. మానవునిచేతి పదివ్రేళ్లు-స్త్రీప్రసవించి బిడ్డనుకన్నట్లు అగ్నిని ఆవిర్భవింపచేయును. అట్టి అగ్నిఉష:కాలమున వెలిగిహవ్యభాజియై,దీప్తిమంతుడయి,సుందర వదనమునపదునైన గొడ్డలివలెశత్రురూపరాక్షసులనుహతమార్చును.

9. అగ్నీ!నీ అశ్వములను మాయజ్ఞమునకుఆహ్వానించుచున్నాము.వాటి ముక్కులనుండినురుగులు వచ్చుచున్నవి.అవి లోహిత వర్ణులు,అకుటిలులు, సుందరగాములు,దీప్తిమంతులు,వయస్కులు, సంఘటితులు,దర్శనీయులు.

10.అగ్నీ! నీ కిరణములుశత్రువులనుపరాభవించునవి.గమన శీలములు.దీప్తములు. పూజనీయములు.అవి మరుత్తులవలెమరింత ధ్వనిచేయును.అవి అశ్వములవలెగమ్యస్థానమునకుధ్వని చేయును.చేరును.

11.సమిద్ధ అగ్నీ! మేమునిన్ను స్తుతించినాము.హోతలు ఉక్థలుఉచ్చరించినారు. యజమానులునిన్ను యజించినారు.కావున నీవు మాకుధనమును ప్రసాదించుము.ప్రశంసించు హోత,అగ్నిని పూజించుటకుఋత్విక్కులు మున్నగువారుపశ్వాది ధనమునుకోరుచు కూడినారు.

## ఏడవసూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత-అగ్ని, ఛందస్సు- 1 జగతి, 2-6 అనుష్టుప్,మిగిలినవి త్రిష్టుప్

1. అప్నవానాదిభృగువంశీయులుఅరణ్యమధ్యమునదావాగ్నిరూప దర్శనీయుడు,సమస్తలోకములకుఈశ్వరుడగు అగ్నిని ప్రజ్వరిల్లచేసినారు. అగ్ని హోత.యాజ్ఞిక శ్రేష్టుడు.స్తుతి భాజనుడు.దేవ శ్రేష్టుడు.అతడు యజ్ఞకారులద్వారా స్థాపించబడినాడు.

2. అగ్నీ!నీవు దీప్తిమంతుడవు.మానవులకు స్తుతియోగ్యుడవు.నీవెలుగులు ఎప్పుడుప్రసంచును? మర్త్యులునిన్ను అందుకొందురు.

3. అగ్నీ!మాయారహితుడు.జ్ఞుడు. నక్షత్రపరివృత ద్యులోకమువంటివాడు. సమస్తయజ్ఞవర్ధకుడు.అట్టి అగ్నిని దర్శించిఋత్విక్కులు మున్నగువారుయజ్ఞగృహమునఅందుకొందురు.

4. అగ్నిప్రజారక్షకుడు. శీఘ్రుగాం.యజమానియొక్కదూత. కేతుస్వరూపుడు.దీప్తిమంతుడు.అట్టి అగ్నిని మానవులుసమస్త ప్రజలకొఱకు ఆరాధింతురు.

5. అగ్నిరమణీయుడు.పంత్ర దీప్త శిష్టుడు.యాజ్ఞిక శ్రేష్టుడు.సప్త తేజోయుక్తుడు.అట్టి హోత,ద్వాంసుడగు అగ్నిని అధ్వర్యుమున్నగు మానవులుయథాస్థానమునప్రవేశపెట్టినారు.

6. అగ్నిమాతృస్వరూప జలసమూహమున,వృక్ష సమూహమునరాజిల్లువాడు. కమనీయుడు.అట్టి అగ్నిని అధ్వర్యుమున్నగు మానవులుప్రతిష్టింతురు.

7. దేవగణములునిద్రాముక్తులయిఉష:కాలమున జలస్థానస్వరూప సమస్త యజ్ఞమునఅగ్నిని స్తోత్రాదులద్వారా ప్రసన్నుని చేయుదురు.మహామహుడు,సత్యవంతుడగుఅగ్ని నమస్కారపూర్వకముగాసమర్పించిన హనిస్వీకరించును. అతడుయజమాని చేయుయజ్ఞములనుసర్వదాగ్రహించును.

8. అగ్నీ!నీవు ద్వాంసుడవు. దేవదూతకార్యజ్ఞాతవు. ఈద్యావాపృథ్వులమధ్యనున్న అంతరిక్షమునునీవు ఎంతో బాగుగా ఎరుంగుదువు.పురాతనుడవు. నీవుకొద్ది హవ్యమునుమరింత చేయగలవాడవు.నీవు దేవతలకుహ అందించుటకుస్వర్గారోహణ స్థానమునకుచేరుదువు.

9. అగ్నీ!నీవు దీప్తిమంతుడవు.నీవు సాగు మార్గమునల్లనిది, మసితోకూడినది. నీ దీప్తిపునరావర్తనముఅగునది. సంచలనశీలమగునీ తేజము సమస్తతేజములందుశ్రేష్టము. నిన్నుపొందలేని యజమానులునీ ఉత్పత్తి కారణస్వరూపమగుకఱ్రను ధరింతురు.ఉత్పన్నుడవయినవెంటనే యజమానిదూతవగుదువు.

10.అరణి మంథనముఉత్పన్నమయినఅగ్ని తేజమునుఋత్విక్కుల ద్వారాచూడనగును. అగ్ని శిఖనువాయువు వహించినపుడుఅగ్ని వృక్షజాలములనుజ్వాలామయముచేయును. అన్నరూపమగుకాష్టాదులను భక్షించును.

11.అగ్ని శీఘ్రుగాములగు తనరశ్మిసమూహములతోఅన్నరూపమగు కాష్టాదులనుచిటికెలో కాల్చికూల్చును.కాష్టములను కాల్చినఅగ్ని వాయుబల సమన్వితుడగును.అశ్వవాహకుడు తనఅశ్వమును బలముగలదానిగా చేసినట్లుగమనశీలుడగు అగ్నితన కిరణములనుబలవర్ధకముగచేసి, వానిని ప్రేరేపించును.

## ఎనిదవసూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత - అగ్ని, ఛందస్సు-గాయత్రి

1. అగ్నీ!నీవు సకల ధనములస్వా. సర్వజ్ఞుడవు.దేవతల హవ్యవాహనుడవు. మరణరహితుడవు.అతిశయ యజనశీలుడవు. దేవదూతవు.మేము స్తుతులతోనిన్ను వర్ధిల్ల చేయుదుము.

2. అగ్నియజమానులఅభీష్ట ఫలదాయకధనదానమునుఎరుగును. అతడు మహానుడు.అతడు దేవలోకఆరోహణ స్థానముఎరుగును. ఇతడు ఇంద్రాదిదేవతలనుయజ్ఞమునకుపిలుచును.

3. అగ్నిద్యుతిమంతుడు.ఇంద్రాది దేవతలకుయజమానులద్వారా నమస్కరింపచేయుటఎరుగును. అతడు యజ్ఞగృహమున యజ్ఞాభిలాషియజమానునకుఅభీష్ట ధనదానము చేయును.

4. అగ్నిహోత. అతనికి దూతకార్యముతెలియును. స్వర్గారోహణస్థానము తెలియును.అగ్ని ద్యావాపృథ్వులమధ్య సంచరించును.

5. యజమానిహవ్యదానముచేయును. అగ్నినిప్రసన్నుని చేయును.అతనిని వర్ధిల్లచేయును. కాష్ఠముద్వారా అతనిని ప్రదీప్తునిచేయును. మేముసహితము ఆయజమానివలెఆచరింతుము.

6. అగ్నికిపరిచర్యలు చేయుయజమాని అగ్నినిభజించి ఆ యజమానిధనమూలమునఃఖ్యాతుడు అగును.పుత్ర పౌత్రాదులద్వారా ప్రసిద్ధుడు అగును.

7. ఋత్విగాదులద్వారా ధనము పొందుటకుమేము నిత్యముయజమానులవద్దకు వెళ్లుదుము యజ్ఞకార్యమునకుమాకు అన్నము లభించవలెను.

8. అగ్నిమేధాః. అతడు తనబలమున మానవులకుఃనాశకారకమగు పాపమునుఃనాశము చేయును.

## తొంౌమ్మదవసూక్తము

**ఋషి- వామదేవుడు,దేవత - అగ్ని, ఛందస్సు-గాయత్రి**

1. అగ్నీ!నీవు మహాహనుడవు.దేవతలనువాంఛించువాడవు.యజమానివద్దకుశాసనముపై కూర్చుండటకుఃచ్చేతువు. నీవుమాకు సుఖములనుప్రసాదించుము.

2. అగ్నినిరాక్షసాదులు హింసించలేరు.అతడు మానవలోకమునకుప్రకటరూపమున ఃచ్చేయును.మృత్యువర్జితుడు.సమస్త దేవతలకుదూత.

3. ఋత్విగాదులుఅగ్నిని తెచ్చెదరు.అగ్ని యజ్ఞమునస్తుతియోగ్యుడుఅగును. అతడు 'పోత' అయియజ్ఞగృహమునప్రవేశించును.

4. యజ్ఞమునఅగ్నిదేవపత్నిఅగును. అధ్వర్యుడగును.గృహపతి. 'బ్రహ్మ'నామక ఋత్విక్కుఅగును. యజ్ఞమునప్రవేశించును.

5. మానవులుయజ్ఞాభిలాషులు.అగ్ని వారి హవ్యముకోరును. అగ్ని అధ్వర్యమున్నగు సకల కర్మములుఎరిగిన బ్రహ్మ,అగ్ని యజ్ఞకర్మములఅఃకల ఉపద్రష్ట.

6. అగ్నీ!నీవు హవ్యమువహించుటకుయజమాని యజ్ఞమును సేఃంతువు. అతని దౌత్యకార్యమునువాంఛింతువు.

7. అంగిరాగ్నీ!నీవు మా యజ్ఞమును సేఃంపుము. మా హవ్యముస్వీకరించుము. ఆహ్వానకారుడయినస్తోత్రను ఃనుము.

8. అగ్నీ!నీ రథము సమస్తదిశలను తిరిగిహః అందించుయజమానిని రక్షించును.అదే అహింసనీయరథము. యజమానినిఅయిన నాకు నలువైపులవ్యాపించవలెను.

## పదవసూక్తము

**ఋషి- వామదేవుడు,దేవత - అగ్ని, ఛందస్సు- 1-3 పదపంక్తి, 4, 6, 7 పదపంక్తి**
**రుష్ణిక్,5 మహాపదపంక్తి,8 శ్రోణిక్**

1. అగ్నీ!మేము ఋత్విక్ గణములము.ఇంద్రాదుల స్తుతిద్వారానిన్ను వర్థిల్లచేతుము.గుఱ్ఱము రౌతునుమోయును. అట్లేనీవు హవ్యవాహకుడవు.నీవు యజ్ఞకర్తవలెఉపకారకుడవు.
భజనీయుడవు,అతిశయ ప్రియుడవు.

2. మాయజ్ఞము భజనీయము,ప్రవృద్ధము, అభీష్టఫలప్రదము,సత్యభూతము,మహంతముఅగ్నీ! నీవు మా యజ్ఞమునకునేతవు.

3. అగ్నీ!నీవు జ్యోతిర్మయసూర్యునివంటి వాడవు.సమస్త తేజోయుక్తుడవు.పరిశుద్ధ అంత:కరణుడవు.మా అర్చనీయ స్తోత్రములద్వారాప్రసన్నుడవు అగుము.మాకు అభిముఖముగాంచ్చేయుము.

4. అగ్నీ!నేడు మేము మాఋత్విక్కుల వచనములచేనిన్ను
స్తుతించుచున్నాము.హవ్యప్రదానముచేయుచున్నాము.సూర్యరశ్మివలె శోధించునట్టినీ జ్వాల ప్రసరించును. మేఘమువలెనీ జ్వాల శబ్దముచేయుము.

5. అగ్నీ!నీ దీప్తి ప్రియతమము.అహర్నిశల అలంకారమువంటిది.అది పదార్థములనుఆశ్రయించును. పదార్థసపమున శోభిల్లును.

6. అగ్నీ!నీవు అన్నవంతుడవు.నీ ంగ్రహముపరిశుద్ధ ఘృతమువంటిది, పాపరహితము.నీ పరిశుద్ధ రమణీయతేజము అలంకారమువంటిదీప్తము.

7. అగ్నీ!నీవు సత్యవంతుడవు.యజమానులద్వారా నిర్మితుడవు.అయినను చిరంజీంం.యజమానులపాపములను నిశ్చయముగాదూరము చేతువు.

8. అగ్నీ!నీవు ద్యుతిమంతుడవు.మా ంషయమున నీసఖ్యత, భ్రాతృభావముమంగళప్రదములు,అట్టి సఖ్యత్వభ్రాతృభావములుదేవస్థానముననుసంపూర్ణయజ్ఞములందునుమాకు ప్రియంకరములుకావలెను.
( ఆంధ్రవచనఋగ్వేద సంహితమూడవ అష్టకము,నాల్గవ మండలముమొదటి అనువాకముసమాప్తము)

పదకొండవసూక్తము రెండవ అనువాకము
ఋషి-వామదేవుడు,దేవత -అగ్ని, ఛందస్సు- త్రిష్టుప్

1. అగ్నీ!నీవు బలవంతుడవు.నీ తేజస్సు భజనీయము.సూర్యుని సపపు పగటియందును
అదినలుదిశల దీప్తిమంతముఅగును. నీదు సుందర, దర్శనీయతేజము
రాత్రులందుదేదీప్యమానమగును.రూపవంతుడగు నీవలనస్నిగ్ధము, దర్శనీయమగుఅన్నము
అధికముగాలభించును.

2. అగ్నీ!నీవు బహుజన్మలవాడవు.నిన్ను యజమానులుస్తుతించుచున్నారు.వారికొఱకు పుణ్యలోకద్వారము ంముక్తముచేయుము. సుందరతేజో ంశిష్టుడవగుఅగ్నీ! దేవతలతోసహాయజమానులకునీవు ధనమునుప్రసాదింతువు. మాకుసహితము అట్టింశేష అభీష్టధనమునుప్రసాదించుము.

3. అగ్నీ!హంర్వహనము,దేవతానయనాదికార్యములు నీవలననేఉత్పన్నమైనం.స్తుతిరూప వచనములునీ వలననే ఉత్పన్నమైనం.

4. అగ్నీ!బలవంతుడు,హవ్యవాహనుడు,మహాయజ్ఞకారి,సత్యబల ంశిష్టుడగుపుత్రుడు
నీవలననేఉత్పన్నమైనాడు.దేవప్రేరిత సుఖప్రదధనము నీ వలననేఉత్పన్నమైనది.శీఘ్రగాంు, గతింశిష్ట, వేగవంతమగుఅశ్వము నీవలననేఉత్పన్నమైనది.

5. అమరాగ్నీ!మానవుల దేవాభిలాషులు.వారు స్తుతుల ద్వారా నీకుపరిచర్యలు చేయుదురు. నీవుదేవతలందుఆదిదేవుడవు.ప్రకాశవంతుడవు.నీ జిహ్వ దేవతలనుతృప్తిపరచునదిఅగును. నీవుపాపములను వేరుచేయువాడవు.రాక్షసులను అణచివేయుకోరికలవాడవు. గృహపతిః.

6. హేబలపుత్రా! అగ్నీ! నీవురాత్రులందు శుభంకరుడవు.దీప్తిమంతుడవు.అట్లయి మాకు మంగళముకలుగుటకు సేఃంపబడుదువు.నీవు యజమానులనుప్రత్యేకముగ పోషించెదవు.అట్లే మానుంచికుమతిని దూరముచేయుము. పాపములనుదూరము చేయుము.సమస్త దుర్మతులనుదూరము చేయుము.

## పన్నెండవసూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత - అగ్ని, ఛందస్సు-త్రిష్టుప్

1.అగ్నీ!స్రుక్కును సంయతముచేసి నిన్ను ప్రదీప్తునిచేయుయజమాని, నీకు త్రిసవనములందుహఃరన్నముఅర్పించు వ్యక్తి నీకుసంతృప్తి కలిగించుకార్యములద్వారా నీయొక్కప్రసహమానతేజమునుతెలిసికొని ధనద్వారమునశత్రువులనుపరాజితులను చేయగలడు.

2. అగ్నీ!ఒకడు నీకొఅకు హోమసాధనకాష్ఠముల సేకరించును.ఒకడు కాష్ఠాన్వేషణమునఅలసి నీ తేజమునకుపరిచర్య చేయును.ఒకడు రాత్రింబవళ్లునిన్ను ప్రదీప్తునిచేయును. అట్టియజమాని ప్రజ్ఞావంతుడు,పశువంతుడగును.శత్రువులనునష్టపరచును. ధనమునుఆర్జించును.

3. అగ్నిమహాబలములకుఈశ్వరుడు. ఉత్కృష్ట అన్నవంతుడు.ధనములకుస్వాఃు. యువతముడు.అతను తనకు పరిచర్యలుచేయు యజమానులకురమణీయ ధనముప్రసాదించును.

4. యువతమాగ్నీ!నీ పరిచారకుల మధ్యఅజ్ఞానవశమునమేము పాపములు చేసిఉండవచ్చును.అట్లయినను నీవుభూఃఁదగల మమ్ముపూర్తిగా నిష్పాపులను చేయుము.సర్వత్ర దృశ్యమానములగుమా పాపములను వదలగొట్టుము.

5. అగ్నీ!నీవు మాకు ఃత్రుడవు.మేము ఇంద్రాది దేవతలవద్దగానిమానవుల వద్దగానిపాపములు చేసిఉండవచ్చును.ఆ మహాపాపములు,ఃస్తృతి పాపములుమాకు ఎట్టి ఃఘ్నములుకలిగించకుండవలెను.మాపుత్ర పౌత్రాదులనుపాపరూప ఉపద్రవములనుంచి శాంతులనుచేయుము. వారికిసుకృతజనిత సుఖములనుప్రసాదించుము.

6. అగ్నీ!నీవు పూజార్హుడవు.నివాసప్రదుడవు.నీవుకాళ్లు కట్టబడినగౌరిగోవును ఃముక్తముచేసినావు. అట్లేమమ్ము పాపములనుండిఃముక్తులను చేయుము.అగ్నీ! మా ఆయువు నీవలన ప్రవర్ధములగును.నీవు దానిని మరింతప్రవృద్ధము చేయుము.

## పదమూడవసూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత - అగ్ని, ఛందస్సు- త్రిష్టుప్

1. అగ్నిశోభన మనస్కుడు.తమోనివారిణి ఉషప్రకాశింపకముందే అగ్నిప్రవృద్ధుడు అగును. అశ్వద్వయమా!ఁరు యజమాని ఇంటికిసాగుడు. ఋత్విగాదులకుప్రేరకుడు సూర్యుడు. అతడుతన తేజమునఉష:కాలమున ఆఃర్భఃంచును.

2. సఃతఉన్ముఖ కిరణములనుప్రసరింపచేయును.బలిష్టమగు ఆబోతుఆవులఁది కోరికతో,దుమ్ములేపుచుఆవులవెంట పడును.అట్లే కిరణములుసూర్యుని ద్యులోకమునకుఎత్తినపుడు వరుణుడు,ఃత్రుడు మున్నగుఅనేకులు దేవతలుతమ తమ కార్యములకుసాగుదురు.

3. సృష్టికారకులగుదేవతలు లోకకార్యములు పరిత్యజింపకసర్వతో భావమునఅంధకారమును దూరముచేయుసూర్యుని సృష్టించినారు. సూర్యుడుసమస్తప్రాణి సమూహములంజ్ఞాత. హరినామకసప్తాశ్వములు ఆ సూర్యునివహించును.

4. ద్యుతిమంతుడవగుసూర్యుడా! జగన్నిర్వాహకరసమును గ్రహించుటకుదారపురూపముగల కిరణములనుస్తృత పరచెదవు.నలుపురంగు రాత్రినివెనుకకు నెట్టెదవు.అత్యంత వహనసమర్థ అశ్వముల ందపయనింతువు. కదలాడుసూర్యకిరణములు అంతరిక్షమధ్యమునఉన్న చర్మమువంటిచీకటిని దూరముచేయును.

5. ప్రత్యక్షలభ్యమానుడగుసూర్యుని ఎంతటివాడునుబంధింపజాలడు.అధోముఖ సూర్యుడు ఏంధముగనుహింసింపబడడు.అతడు ఏ బలమునఊర్ధ్వముఖ గమనముచేయుచున్నాడు ద్యులోకముననిలిచిన స్తంభమువంటిస్వర్గమును పాలించును.దీనిని గ్రహించినవాడెవడు?
**( ఈతత్త్వమునుగ్రహించినవాడులేడని భావము)**

## పదునాలుగవసూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత - అగ్ని, ఛందస్సు- త్రిష్టుప్

1. జాతవేదఅగ్నీ! తేజమునదేదీప్యమానమయిఉష ప్రవృద్ధమయినది.శేషగమనశీల అశ్వద్వయమా!రు రథముతో మా యజ్ఞమునకుఅభిముఖులుకండు.

2. సంతసమస్త భువనములనుఆలోకించును. తదుపరిఉన్ముఖ కిరణుడుఅగును. సమస్తమునువరముగా చూచుసూర్యుడు తన కిరణములతోద్యావాపృథ్వులనునింపును.

3. ఉషధనమును ధరించినది.అరుణవర్ణ జ్యోతిమతిరశ్మిచిత్రిత.దుషీమణి ఉష వచ్చినది.ప్రాణులను జాగృతముచేసినది. సుయోజితరథమును అధిరోహించినది.సుఖప్రాప్తి కొఱకు సాగినది.

4. ఉషఉదయించినది. అత్యంతవహనక్షమగలం, గమనశీలములగుఅశ్వములు ఈ యజ్ఞమునకురావలెను. ఇదిం కొరకైన సోమము. ఈసోమపానము చేయుడు.సంతుష్ట మనస్కులగుడు.

5. ప్రత్యక్షలభ్యమానుడగుసూర్యుని ఎంతటివాడునుబంధింపజాలడు.అధోముఖ సూర్యుడుఏంధముగను హింసింపబడడు.అతడు ఏబలమునఊర్ధ్వముఖ గమనముచేయుచున్నాడు?
ద్యులోకముననిలిచిన స్తంభమువంటిసూర్యుడు స్వర్గమునుపాలించును. దీనినిగ్రహించినవాడెవడు?
(14వసూత్రమున 5వమంత్రము పునరావృతమయినది.అర్థభేదముసహితము లేదు.
**"ఇయమృక్పూర్వంవ్యాఖ్యాతం"** అన్నాడుశాయణాచార్యులు)

## పదిహేనవసూక్తము

### ఋషి-వాసుదేవుడు,దేవత-1-6 అగ్ని, 7-8సోముడు, 9-10 అశ్వినులు,ఛందస్సు - గాయత్రి

1. హోమనిష్పాదకులగు దేవతలమధ్యదీపించు, యజ్ఞార్హమగుఅగ్ని మా యజ్ఞమునకువడినడకలగుఱ్ఱమునువలెతీసికొని రాబడును.

2. అగ్నిదేవతలకొఱకుఅన్నము ధరించును.నిత్యము మూడుమారులురథమువలెయజ్ఞమునకువెళ్లును.

3. అగ్నిఅన్నపాలకుడు. మేధాం.అతడు హం అందించుయజమానులకురమణీయ ధనమునుప్రసాదించును. హవ్యమునునలుదిశల వ్యాపింపచేయును.

4. సృంజయుడుదేవపుత్రుడు.అగ్ని అతని కొఱకు తూర్పుదిక్కుననిలిచినాడు. అగ్నిఉత్తరవేదిన సంధాయుక్తుడుఅగును. శత్రునాశకారి అగ్నిదీప్తియుక్తుడు కావలెను.

5. అగ్నినిరమానవులు స్తుతింతురు.తీక్షణ తేజోవంతుడు,అభీష్టవర్షి, గమనశీలఅగ్నిద మానవుడుతన ఆధిపత్యమునుపెంచవలెను.
(అగ్నిద మానవుని ఆధిపత్యమేశాస్త్రవృద్ధి. అణుస్ఫోటకమునసహితము అగ్నియేఆర్భంచును)

6. అగ్నిఅశ్వమువంటి హవ్యవాహుడు.ద్యులోక పుత్రుడు. సూర్యునివలె దీప్తిమానుడుభజనీయుడు.యజమానులుఅట్టి అగ్నికి తేపతేపపరిచర్యలు చేసెదరు.

7. సహదేవపుత్రుడు సోమకుడు.అతడు మాకు అశ్వద్వయమునుఇచ్చెదను అన్నాడు.అప్పుడు మేము అతనివద్దకు వెళ్లినాము.గుర్రములను తెచ్చుకున్నాము.

8. సహదేవపుత్రుడు సోమకునినుండి ఆరోజే ఆ పూజనీయఅశ్వములను తెచ్చుకున్నాము.

9. కాంతిమంతులగుఅశ్వినులారా! ఉభయులకుతృప్తి కలిగించినసహదేవ పుత్రుడుసోమకుడు నిండునూరేళ్లుజీంచవలెను.

10.కాంతిమంతులగుఅశ్వినికుమారులారా! సహదేవపుత్రుడు సోమకునకుదీర్ఘాయువు ప్రసాదించండి.

## పదహారవసూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత- ఇంద్రుడు,ఛందస్సు-త్రిష్టుప్

1.సోమవంతుడు,సత్యవంతుడగుఇంద్రుడు మావద్దకుచ్చేయవలెను.అతని అశ్వములు మావద్దకురావలెను. అభిషంచెదము.అతడు మా స్తుతులుఅందుకొనవలెను.మాకోరికలు తీర్చవలెను.

2. ఇంద్రా!నీవు శత్రువులనుపరాజితులను చేయువాడవు.దారిముగిసిన తరువాతగుఱ్ఱమును వదలినట్లుఈ మధ్యాహ్నసవనమున మమ్ముముక్తలము చేయుము.అందువలన మేముకు సంతృప్తి కలిగించగలము.

ఇంద్రా!నీవు సర్వదుడవు.అసుర సంహారకుడవు.యజమానులునీకొఱకు మనోహరఉక్థములు ఉచ్చరించెదరు.

3. ద్వాంసులునిగూఢార్థములనుగ్రహింతురు. అట్లేఅభీష్టవర్షి ఇంద్రుడుకార్యములను గ్రహించును.ఇంద్రుడు మాదకసోమమును అధికముగసేంచి హృష్టుడుఅయినపుడు ద్యులోకమునుండి సప్తసంఖ్యాకకిరణములను వాస్తవముగఉత్పన్నము చేయును.స్తోత్రయోగ్యములగుకిరణములు పగలుసహితము మానవులజ్ఞానమును పెంపొందించును.

4. ద్యులోకముశాలము. జ్యోతిస్వరూపము.కిరణములు ద్యులోకమునుమరింత దర్శనీయముచేసిన. అప్పుడుదేవతలు స్వర్గమువనివసించుటకు ఉత్సాహపడినారు.సూర్యుడు నేతలందుశ్రేష్టుడు. అతడుఘనీభూతమగుఅంధకారమును పారద్రోలినాడు.మానవులు సమస్తముచూచుటకు సాయపడినాడు.

5. సోమశిష్టుడగు ఇంద్రుడుఅంత మహిమలుకలవాడు. అతడుతన మహిమశక్తివలన ద్యావాపృథ్వులనుపూరించినాడు. ఇంద్రుడుసమస్త భువనములనుసృష్టించినాడు. ఇంద్రునిమహిమ సమస్తభువనములనుంచినది.

6. మానవులకుహితకరమగువృష్టాది కార్యములనుఇంద్రుడు ఎరుగును.
అభిలాషకారులు,ఋత్రుభూతులగుమరుత్తుల కొఱకుజలవర్షము కురిపించినాడు.మరుత్తులు వచనరూపధ్వనితో
పర్వతములనుదీర్ణము చేసినారు.ఆ మరుత్తులు ఇంద్రునికొఱకు గోపూర్ణ గోశాలనుఆచ్చాదితము చేసినారు.

7. ఇంద్రా!నీ వజ్రము లోకపాలకము.అది 'జలావరక'మేఘమును ప్రేరేపించినది.చేతనావతిభూమి నీతో
సహవాసముచేసినది. వర్షముకలిగించు ఇంద్రా! నీవుస్వబలమున లోకపాలకుడవుఅయినావు. ఇంద్రా!
సముద్రసంబంధ జలమును,ఆకాశమున ఉన్న జలమునుప్రేరేపించుము.

8. ఇంద్రా!నీవు బహుజనఆహుతుడవు.నీవు వర్షము కలిగించుటకుమబ్బులనుకొట్టినావు.
అప్పుడుదేవతల కుక్క'సరమ' పణులు దొంగిలించిదాచిన గోవులనుకనబరచినది.అంగిరులు నిన్ను
స్తుతింతురు.నీవు మాకు విశేష అన్నముఅందింతువు. మమ్ముఆదరింతువు.

9. ఇంద్రా!నీవు ధనవంతుడవు.మానవులు నిన్నుఆదరింతురు. ధనముప్రసాదించుటకు నీవుకుత్సుని వద్దకు
వెళ్లినావు.అతడు నిన్ను యాచించినాడు.నీవు అతనికి ఆశ్రయదానముచేసినావు.
శత్రువులఉపద్రవములనుండిఅతనిని రక్షించినావు.కపట ఋత్విక్కులకార్యములను ఎరిగినావు.కుత్సుని
ధనలోభశత్రువులనునష్టపరచినావు.
(బ్రాహ్మణరూపమున ఉన్న కపటదస్యులగు ఋత్విక్కులు-కపట ఋత్విక్కులు." **ఆ బ్రహ్మాదస్యు:** "అని వేదము)

10.ఇంద్రా! నీవు మనసునశత్రువును వధించసంకల్పించినావు. కుత్సునిగృహమునకుచేరినావు. కుత్సుడుసహితము
నీతోమైత్రి చేయుటకుఎంతో ఉత్సాహముకనపరచినాడు. అప్పుడుమీరిద్దరు ఒకేస్థానమునకుచేరినారు. నీ
సత్యదర్శినిభార్య 'శచి' మీ ఇద్దరినిఒకే రూపమున చూచిసంశయించినది.
ఇంద్రుడు,కుత్సుడు ఒకే రూపము వారనిఇచట చెప్పినాడు.దీనికి సంబంధించినవృత్తాంతము
శాయణుడువివరించలేదు."**anabsurd story**"అని ఒక ఆంగ్ల వ్యాఖ్యాత.ఒకే రూపము వారు ఇద్దరు
ఉండుటఅసంభవముకాదు.ఇంద్రుడు ఆకారణముననేకుత్సునితో స్నేహముచేసినను
చేసిఉండవచ్చు.

11.కుత్సుడు ప్రాజ్ఞుడు.సాధించవలసినఅన్నము కొఱకువలెసాగినాడు. అశ్వద్వయమునురథమున
పూన్చినాడు.ఉపద్రవమునుఎదిరించుటకు సన్నద్ధుడుఅయినాడు. అదిగో ఆరోజేనీవు కుత్సుని
రక్షించదలచినావు.కుత్సునివెంట అతనిరథముమీద సాగినావు.
ఇంద్రా!నీవు శత్రునాశకుడవు.వాయువువంటిఅశ్వములకు అధిపతివి.

12.ఇంద్రా! నీవు కుత్సునికొఱకు సుఖరహితుడగు'శిష్ణు'ని వధించినావు.అనేక పరిజనులతోకూడిఅప్పుడే
శత్రువులనుదునుమాడినావు.సంగ్రామమున నీవుసూర్యుని చక్రమునుముక్కలు చేసినావు.

13.ఇంద్రా! నీవు 'పిప్రు' 'మృగయ'నామక అసురులను కడతేర్చినావు. 'విధిథ'పుత్రుడు ఋజాశ్వునిపట్టి
బంధించినావు.ఏబదివేల కృష్ణవర్ణరాక్షసులను హతమార్చినావు.వార్ధక్యము రూపమునుచెరచినట్లుశంబరుని
నగరములనుధ్వంసము చేసినావు.

14.ఇంద్రా! నీవు మరణరహితుడవు.నీవు సూర్యుని వద్దనిలిచినపుడు ప్రకాశవంతుడవుఅగుదువు.
సూర్యునిముందుఅందరి రూపములు ఒకే తీరుఅగును. కాని ఇంద్రుడుమరింత
ప్రకాశవంతుడుఅగును.

ఇంద్రా!నీవు మెకమువలెశత్రువును కూల్చెదవు.ఆయుధముదాల్చిసింహమువలె
భయంకరుడవగుదువు.

15.రాక్షసుల వలనకలిగిన భయనివారణకుగానుఇంద్రుని ఉపాసించువారుఉందురు. ధనమునుకోరి ఇంద్రుని ఉపాసించువారుఉందురు. అట్టివారు యుద్ధసదృశయజ్ఞమున ఇంద్రునిఅన్నము యాచింతురు.ఉక్థలతో స్తుతింతురు.ఇంద్రుని వద్దకుచేరుదురు. ఆ సమయమునఇంద్రుడు స్తోతలకునివాస స్థానమువంటివాడగును. రమణీయము,దర్శనీయమగు లక్ష్మీరూపమున ఉండును.

16.ఇంద్రుడు మానవులకుహితకరములగుఅనేక ప్రసిద్ధకార్యములుచేసినాడు. అతడుధన ిశిష్టుడు. అతడుమావంటి స్తోతలకుసాధించదగినఅన్నమును సులభముగాఅందించును. యజమానులారా!మేము స్తోతలము.ఆ ఇంద్రుని ఁ కొఱకు ఆహ్వానించుచున్నాము.

17.మేము మానవులము.ఏ యుద్ధమునందయిననుమా మధ్య భయంకరపిడుగు పడవచ్చును.శత్రువులతో మాకుఘోర యుద్ధము జరుగవచ్చును.ఇంద్రా! నీవు శూరుడవు.అట్టితరి మా దేహములనురక్షింపుము.

18.ఇంద్రా! నీవు వామదేవునియజ్ఞకార్యమునురక్షింపుము. నీవు హింసారహితుడవు. యుద్ధమునమాకు సఖుడవు అగుము.నీవు మతిమంతుడవు.మేము నీదరికి చేరుదుము.నీవు సర్వదా స్తోత్రకారులనుప్రశంసించుము.

19.ఇంద్రా! నీవు ధనికుడవు.శత్రువులనుజయించుటకుగాను,మేము అన్ని యుద్ధములందు నిన్నేకోరుదుము. అభిలషింతుము.ధనికుడు ధనమునదీప్తివంతుడగును.హవ్యయుక్తములయి,పుత్ర పౌత్రాది పరిజనసహితులమయిమేమును అట్లేదీప్తివంతులముఅగుదుము. శత్రువులనుపరాభంంతుము. రాత్రులందునుసంపూర్ణ సంవత్సరముననిన్ను స్తుతింతుము.

20.ఇంద్రునితో మా సఖ్యతచెడరాదు. తేజస్వి,శరీరపాలక ఇంద్రుడుమమ్ము రక్షించవలెను. ఇంద్రునకుమేము అందుకు తగినపరిచర్యలు చేసెదము.నిపుణుడగు రథనిర్మాతరమణీయమగురథమును నిర్మించును.అట్లే అభీష్ట,నిత్యయవ్వనఇంద్రునకు స్తోత్రములురచింతుము.

21.ఇంద్రా! నిన్ను పూర్వ ఋషులుస్తుతించినారు. మేమునుస్తుతించుచున్నాము.మా స్తుతులకు ప్రసన్నుడవగుము.జలములు నదినిపూరించినట్లు స్తోతలఅన్నమును అభివృద్ధిపరచుము.హరిిశిష్ట ఇంద్రా!మేము అభినవస్తుతులు రచించెదము.అందువలన మేమురథవంతులమయిసర్వదా నీసేవ చేయగలము.

## పదిహేడవసూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత - ఇంద్రుడు,ఛందస్సు - 15 ిరాట్ -ిగిలినఁ త్రిష్టుప్

1.ఇంద్రా! నీవు గొప్పవాడవు.మహత్వయుక్తమగుపృథ్వి నీ బలమునుఆమోదించినది. ద్యులోకమునీ బలమునుఆమోదించినది.లోకములను ఆవృతముచేసిన వృత్రునినీ బలమున సంహరించినావు.వృత్రుడు గ్రస్తముచేసిన నదులనునీవు ిముక్తము చేసినావు.

2. ఇంద్రా!నీవు ద్యుతిమంతుడవు.నీవు పుట్టగనే నీకోపభయమునద్యులోకము కంపితమయినది.భూి గడగడలాడినది.అభ్యుదయమునకుగాను.బృహత్ మేఘసమూహము నీకుకట్టుబడినది.ఈ మేఘములు ప్రాణులదాహము తీర్చినఁ.మరు భూములందుజలములనుకలిగించినఁ.

3. ఇంద్రుడుశత్రుపరాభవకర్త. అతడు తనతేజోప్రకాశమునకుబలమైన వజ్రముిసరియు పర్వతములనుిదీర్ణము చేసినాడు.సోమపానమున హృష్టుడయినఇంద్రుడు వృత్రునివధించినాడు.వృత్రుడుపోగా జలముఅనావృతమయినది.వేగమున ప్రవహించినది.

4. ఇంద్రా!నీవు అత్యంత స్తుతియోగ్యుడవు.వజ్ర ిశిష్టుడవు.స్వర్గమందు ినాశరహితుడవుమహిమాన్వితుడవు.ిమ్ము సృష్టించినద్యుతిమంతప్రజాపతులు తమనుసుందర పుత్రవంతులుగాభాించినారు. ఇంద్రునిసృష్టించిన ప్రజాపతికార్యము అత్యంతశోభనీయము.

5. ఇంద్రుడుసంపూర్ణ ప్రజకు ప్రభువు.బహుజనఆహుతుడు.దేవతలలోఏకమాత్ర ప్రదాని. శత్రుభయినాశకుడు. ద్యుతిమంతుడు.ధనవంతుడు.బంధువు. సమస్తయజమానులువాస్తవముగా ఇంద్రునిస్తుతింతురు.

6. సోమముసొంతము నిజముగాఇంద్రునకు చెందినది.మదకారకముగా సోమమునిజముగా ఇంద్రునకుహర్షకారకమగును.

ఇంద్రా!నీవు ధనపతి.పశుపతి. ధనముకొఱకుగానునిజముగా నీవు సమస్తప్రజలను ధరింతువు.

7. ఇంద్రా!నీవు ధనవంతుడవు.నీవు ముందే జన్మించినావు.వృత్రునివల్లభయభీతులయిన ప్రజలనుభరించినావు.ఉదకవంతమగు దేశముకొఱకుగాను ఉదక నిరోధకవృత్రుని తొలగించినావు.

8. ఇంద్రుడుఅనేక శత్రుహంతకుడు.అత్యంత దుర్ధర్షశత్రు నివారకుడు. నాశరహితుడు.అభీష్టవర్షి. శోభనవజ్ర ిశిష్టుడు.అట్టి ఇంద్రుని మేముస్తుతింతుము. వృత్రహంతఇంద్రుని, అన్నదాతఇంద్రుని, శుభప్రదధనయుక్త ఇంద్రునిమేము స్తుతింతుము.

9. ఇంద్రుడుధనవంతుడు.యుద్ధమునఅద్వితీయుడు. అట్లనివాడుక. అతడు సంఘటిత,ిశాల శత్రుసేననునష్టపరచును. అతడుయజమానికి ఇచ్చినఅన్నమునే తానుస్వీకరించును. ఇంద్రునితోమామైత్రి ప్రియముకావలెను. " **ప్రియాసఃసఖ్యేస్యామ**"

10.ఇంద్రుడు శత్రుహింసకుడు.శత్రుంజయుడు.అందుకు అతడు సర్వత్రప్రఖ్యాతుడు. అతడుశత్రువులనుండిపశువులను గుంజితెచ్చును. ఇంద్రుడునిజముగా కోపించినపుడుస్థావర జంగమాత్మకమగుసమస్త లోకములుగడగడలాడును.

11.ధనవంతుడగుఇంద్రుడు అసురులనుజయించినాడు. శత్రువులరమణీయ ధనమునుజయించినాడు. అశ్వ సమూహములనుజయించినాడు. అనేకశత్రు సేనలనుజయించినాడు. ఇంద్రుడుసర్వసమర్థుడు. నేతృశ్రేష్టుడు.స్తోతలు స్తుతించువాడు.పశువుల ిభాజకుడు.ధనములనుధరించువాడు.

12.ఇంద్రుడు తనతల్లినుండి ఎంతబలము పొందినాడు?తండ్రినుండి ఎంతబలము పొందినాడు!ఇంద్రుడు తనతండ్రి ప్రజాపతిదగ్గర నుండి దృశ్యమానమయినసమస్త జగమునుసృష్టించినాడు. ఆ ప్రజాపతిదగ్గర ఉండియే మరలమరల జగములకుబలము సమకూర్చినాడు.ఇంద్రుడు గర్జనశీలమేఘ ప్రేరితవాయువువలెఆహుతుడుఅగును.

13.ఇంద్రుడు ధనవంతుడు.అతడు ఒక్కొక్క ధనశూన్యునిధనవంతునిచేయును. అంతరిక్షమువజ్రయుక్తము.ఇంద్రుడును అట్టివాడగును.అతడు ఘనీభూతపాపములను పారద్రోలును.స్తోతలకు ధనముప్రదానము చేయును.

14.ఇంద్రుడు సూర్యుని ఆయుధమునుప్రేరేపించినాడు. యుద్ధమునకుపోగు "ఏతశు"ని నివారించినాడు.తేజమునకుమూలభూతము,జలస్థాన స్వరూపముఅంతరిక్షము. అక్కడ ఉన్నఇంద్రుని కుటిలగతిగలకృష్ణవర్ణ మేఘముఅభిషిక్తుని చేసినది.

15.ఎట్లనగా యజమానిరాత్రులందు సోమముద్వారా అగ్నిని అభిషేకించినట్లు.
(స్వశ్వుడనువాడుపుత్రార్థియై సూర్యునిఉపాసించినాడు. సూర్యుడుతన రూపములగుపుత్రుని ప్రసాదించినాడు.అతడు ఏతశుడు అనుఋషితో యుద్ధముచేసినాడు. ఏతశుడుఇంద్రుని ప్రార్థించినాడు.సూర్యసంబంధమునఇంద్రుడు నివారించినాడు)
(15వమంత్రము ఏకపదారాజితము.ఇది పూర్వమంత్రమునకుఅనుబంధమగును)

16.మేము మేధావులమగుస్తోతలము, గోవులనుకోరుచున్నాము. అశ్వములనుకోరుచున్నాము. అన్నమునుకోరుచున్నాము. స్త్రీనికోరుచున్నాము. మేముఇంద్రునితో సఖ్యతకొఱకు కోరికలు తీర్చువాడు,భార్యాప్రదుడు,సర్వదారక్షకుడగు ఇంద్రునిముందుబానుండి నీరు తోడుటకువంగినట్లు అవనతములముఅగుదుము.

17.ఇంద్రా! నీవు ఆప్తుడవు.సకల జనసంరక్షకుడవు.మాకు రక్షకుడవగుము.నీవు సోమయోగ యజమానులకోర్కెలు తీర్చెదవు.సుఖములను ఇచ్చెదవు.నీది ప్రజాపతులతోసమానఖ్యాతి.నీవు పాలకుడవు.పాలకులందు శ్రేష్ఠుడవు.నీవు పితరుల స్రష్టవు.స్వర్గాభిలాషులగుస్తోతలకు అన్నప్రదుడవుఅగుము.

18.ఇంద్రా! మేము నీ మైత్రినిఅభిలషించుచున్నాము.నీవు మాకు రక్షకుడవగుము.నీవు స్తుతియోగ్యుడవు.మాకు ిత్రుడవగుము.నీ స్తోతలకు అన్నముఅనుగ్రహించుము.

19.ఇంద్రా! మేము బాధలమధ్యన ఉన్ననుస్తుతి రూపమున నిన్నుపూజింతుము. నిన్నుఆహ్వానింతుము.ఇంద్రుడు మా స్తుతులనుఅందుకున్నపుడు వంటరిగనేఅనేక శత్రుసేనలనుపరిమార్చును.

ఇంద్రునిశరణునందున్నస్తోతను దేవతలుగానిమానవులుగాని ఎదిరించజాలరు.ఆ ఇంద్రునకు స్తోత్రప్రియుడగును.

20.ఇంద్రుడు ధ శబ్దవంతుడు.సమస్త ప్రజలధర్త. ధనవంతుడగుఇంద్రుడు మా స్తుతులుస్వీకరించవలెను.మేము సత్యరూపమునఅభిలషించినవానినిసమకూర్చవలెను.ఇంద్రా! నీవు
సమస్తప్రాణులకు రాజువు.స్తోతకు మహిమాన్వితమగుయశస్సు లభించును.అట్టి అధికయశస్సుమాకు కలిగించుము.

21.ఇంద్రా! నిన్ను పూర్వ ఋషులుస్తుతించినారు. మేమునుస్తుతించుచున్నాము.మా స్తుతులకు ప్రసన్నుడవగుము.జలములు నదినిపూరించినట్లు స్తోతలఅన్నమును అభివృద్ధిపరచుము.హరి శిష్ట ఇంద్రా!మేము అభినవస్తుతులు రచించెదము.అందువలన మేమురథవంతులమయిసర్వదా నీసేవ చేయగలము.
(ఇది16వ సూక్తమునందలి21వ మంత్రముపునరావృతము)

## పద్దెనిదవసూక్తము

## ఋషి-వామదేవుడు,దేవత - ఇంద్రుడు,అదితి; ఛందస్సు-త్రిష్టుప్

1. ఇంద్రుడుఅనుచున్నాడు:-
ఈ యోనినిర్గమణ రూపమార్గముఅనాదిది. పూర్వాపర లబ్దమైనది.ఈ యోని మార్గమునుండియేసమస్త దేవతలు,మానవులు జన్మించినారు.కావున నీవు గర్భమునపెరిగి ఈ మార్గము నుండియేజన్మించుము. తల్లిమృత్యువునకుకారకుడవు కాకుము.

2. వామదేవుడుఅనుచున్నాడు:-
"నేనుఈ యోని మార్గముద్వారా బయటికిరాను.ఇది అత్యంత దుర్గమమార్గము. నేనుపార్శ్వభేదము చేసిబయటకు వచ్చెదను.ఇతరులకు సాధ్యపడనిఅనేక కార్యములు నేనుచేయవలసిఉన్నది. ఒకరితో యుద్ధముచేయవలసిఉన్నది. ఒకరితో వాదప్రతివాదము చేయవలసిఉన్నది"

3. ఇంద్రుడుఅనుచున్నాడు:-
"తల్లిచనిపోవును. అట్లయిననుపురాతన మార్గముచెరగదు. త్వరగా బయటికిరమ్ము"

వామదేవుడుబదులు పలుకుచున్నాడు:-
ఇంద్రుడుఅభిషవకారి అయిన త్వష్టగృహమున ప్రవేశించినాడు.అక్కడ అధిక ధనముసమకూర్చిన సోమముఉన్నది. దానిని ఇంద్రుడుబలపూర్వకముగా సంగ్రహించినాడు.పానము చేసినాడు.
(ఇంద్రుడుఅకార్యము చేసినాడనిఎత్తిచూపినాడు)

4. వామదేవుడుఅధిక్షేపించుచున్నాడు:-
అదితిఇంద్రుని అనేక మాసములుఅనేక సంవత్సరములుభరించినది.ఇంద్రుడు ఈ ిరుద్ధ కార్యముఏల చేసినాడు?

వామదేవా!కొందరు దేవతలుపుట్టినారు. కొందరుపుట్టనున్నారు. వారితోఇంద్రుని పోల్చుటసరికాదు.

5. గహ్వరరూపమగుసూతికాగృహమునఇంద్రుడు పుట్టినాడు.తల్లి అతనిని నిందనీయుడుఅనుకున్నది. అతనినిఅతిశయ సామర్థ్యముగలవానిని చేసినది.పుట్టగానే ఇంద్రుడుతన తేజమునుధరించినాడు. లేచినాడు.ద్యావాపృథ్వులనుపరిపూర్ణము చేసినాడు.

6. 'అలలా'శబ్దము చేయుచుజలవతులగునదులు
ఇంద్రునిమహత్తునుప్రకటించుటకుగానుహర్షపూర్వకముగబహుింధశబ్దములు చేయుచుప్రవహించును. ఋషీ!అం ఏు పలుకుచున్నవోఈ నదులను చేసినాడు.

7. వృత్రవధవలనఇంద్రునకు కలిగినబ్రహ్మహత్యాపాతకమును గురించి**"నింత్"** ఏమంటున్నది?నీరు నురుగు రూపమునఇంద్రుని పాపమును ధరించినది.నాకొడుకు మహావజ్రమునవృత్రుని వధించినాడు.తరువాత ఈ నదులనుప్రవహింపచేసినాడు.
( **"నింత్"**ఇంద్రుని, మరుత్తులనుసంబోధించి చేసిం శేష స్తోత్రములు.ఇంద్రుని పాపమును నీటినురుగు ధరించినదనిఒక ఆఖ్యానము)

8. వామదేవుడుఅనుచున్నాడు:-
ఇంద్రా!యువతి అయిన నీతల్లి అదితిప్రమత్తముగనేనిన్ను ప్రసంచినది.ప్రమత్తముగనే 'కుషవ'రాక్షసి నిన్ను ంగినది.నీవు పుట్టినపుడుజల సమూహములుప్రమత్తముగనేనిన్ను సుఖప్రదునిచేసినం. నీవు ప్రమత్తముగనేనీ ీర్య ప్రభావమునసూతికా గృహమునరాక్షసిని వధించుటకుజాగృతుడవయినావు.

9. ధనవంతుడవగుఇంద్రా! "వ్యంస" రాక్షసుడునీ హనుద్వయముంరిచి అపహరించినాడు.అనంతరము నీవుఅధిక బలవంతుడవుఅయినావు. వజ్రమునవ్యంస రాక్షసుని తలముపిండికొట్టినావు.

10.తొలిచూలు ఆవుదూడనుప్రసంచినట్లుఇంద్రమాత అదితితన ఇచ్ఛానుసారముఇంద్రుని ప్రసంచినది.ఇంద్రుడు పెద్దవాడు.అనంతబలశాలి.గెలువరానివాడు. అభీష్టవర్షి.ప్రేరకుడు స్వయంగమనక్షముడు.శరీరాభిలాషి.

11.ఇంద్రమాత అదితిఇంద్రుని అడిగినది.పుత్రా అగ్ని! మున్నగుదేవతలు నిన్నుత్యజించుచున్నారట?

ఇంద్రుడుంష్ణువుతో అన్నాడు:-
సఖా!ష్ణూ! నీవు వృత్రునివధింపదలచినచోఅత్యంత పరాక్రమశాలిఅగుము.

12.ఇంద్రా! నీవు కాక ఏ దేవతతల్లిని ిధవనుచేసినాడు? ఏ కారణముననీవు నీ తండ్రిరెండు కాళ్లు పట్టివధించినావు?నీవు నిద్రలో ఉన్నప్పుడుగానిమేల్కొని ఉన్నపుడుగానినిన్ను ఎవడు చంపదలచినాడు?సుఖములు ప్రసాదించుటలోనిన్నుంచిన దేవతఏడి?

13.మాకు జీవనాధారములభించక కుక్క పేగులుతిన్నాము.దేవతల మధ్యఇంద్రుని ించి సుఖములుప్రసాదించు అవ్యయదేవతలేడు.మాభార్యను అవమానించుచుండగాచూచినాము.
అనంతరముఇంద్రుడు మా కొఱకుమధుర జలములుఅందించినాడు.

## ఆలోచనామృతము

1. 18వసూక్తమునకు ప్రత్యేకతవున్నట్లు తోచును.

**i**.ఈ సూత్రమున ద్రష్ట,దేవత ఒక్క రే.

**ii**.మహిళాఋషి అదితి దర్శనంచ్చిమాట్లాడినది.

**iii**.అదితి తనపుత్రుని సమర్థించుకొనుట.

2. ఇదిఇంద్ర వామదేవసంవాదమని శాయణుడువాఖ్యానించినాడు.వామదేవుడుగర్భమునందు ఉండగనేతాను సాధారణ మార్గమునబయటికిరాననియుతల్లి పక్కభాగమునుండివత్తుననియుఅన్నాడు. వామదేవునితల్లి ప్రార్థనందఇంద్రుడు, అదితివచ్చినారు. ఇది వారిసంభాషణము.

**ii).The interesting part of the absurd story is its accordance with the birthof SAKYAMUNI, according to the Buddists, who may poosibly hava borrowedthe notion from the vedas" whilson.**

**iii).The main subject is the birth and ifarey of INDRA. Teh comment tatorserrone-ously take the stanza as refering to the birth of VAMADEVA......GRIFFTH.**

**iv)**ప్రసవ ప్రకారమును,ప్రసవవేదన తగ్గించుటకునాటినుండి నేటివరకునిరంతర ప్రయత్నముసాగుచున్నది. ఇదిమార్గము మార్చుటకుఆనాడు జరిగిన ప్రయత్నము కావచ్చును.ప్రయత్నము, పరిశోధనలుఅన్నియు అనుకున్నఫలితములనుఇవ్వకపో వచ్చును.ఫలితము సరియైనదిఅయినను కలకాలమునిలువక పోవచ్చును.
ఇదిపరిశోధన జరుగుతున్నప్పటిస్థితి అని నా అభిప్రాయము.ఇందు absurdity అసంగతము,అనుచితము ఏంయులేదు.

ఇకగర్భమున ఉండి మాట్లాడుటనుగురించి, ఒక ిషయమునువ్య క్తపరుచుటకు కంచేసిన కల్పనకావచ్చును.

రిప్‌వాన్ంకిల్ ఇరువది ఏళ్లనిద్రకల్పనయే!

అభిమన్యుడుగర్భమున ఉండి ిన్నాడనిభారతమున చెప్పబడినది.
గర్భస్థశిశువులకు శిక్షణనిచ్చుకార్యక్రమము పాశ్చాత్యదేశములందుప్రస్తుతము అమలులోఉన్నది.

2. తొలిసారిగాఇంద్రుని అధిపత్యమునుప్రశ్నించుట జరిగినది.ఇంద్రుడు సహితముసాధారణ మానవునివలెఅకార్యము చేసినాడనితొలుత ఎత్తిచూపినవామదేవుడుచివరన ఇంద్రునిమహత్తునుపొగడినాడు.

3. ఇంద్రునిపాపమును నీటినురుగుగ్రహించుటఒక సత్కార్యమునకు ప్రకృతిఅనుకూలించుటనుసూచించును.

4. ఈసూక్తమునందలివృత్తాంతములంవరములు అందుబాటులోలేవు.

iత్వష్ట వద్దనుంచి ఇంద్రుడుసోమము దొంగిలించుట.ii ఇంద్రుడుఅనేక సంవత్సరములుఅదితి గర్భమునఉండుట.

iiiకుషన రాక్షసి ఇంద్రునింంగుట.

ivఇంద్రుడుతండ్రిని వధించుట.vఅగ్నిదేవాదులు ఇంద్రునిదిండ అలుగులు13వ మంత్రమునతనను అతినీచముగాచెప్పుకున్నాడు. ఆ వృత్తాంతములంవరములు లేవు.
ంశ్వాంత్రుడుచెప్పుకున్నాడు. ఆ వృత్తాంతములంవరములు లేవు.
ంశ్వాంత్రుడుకుక్క మాంసము తిన్నట్లుమహాభారతమునచెప్పబడినది.

**(ఆంధ్రవచనఋగ్వేద సంహితమూడవ అష్టకమునాల్గవ మండలమునఅయిదవ అధ్యాయముసమాప్తము)**

## ఆరవఅధ్యాయము పందొంమ్మదవసూక్తము

**ఋషి- వామదేవుడు,దేవత - ఇంద్రుడు,ఛందస్సు త్రిష్టుప్**

1. హేవజ్రవంతా! ఇంద్రా!ఈ యజ్ఞమునకుశోభన ఆహ్వానయుక్తులు,రక్షకులగు నిఖిల దేవగణములు,ద్యావాపృథ్వులు వృత్రవధకుఏకమాత్రబాధ్యుడవగునిన్ను భజించుటకుంచ్చేసినారు. నీరు స్తోతవ్యడవుమహా గుణోత్కర్షుడవు.ప్రవృద్ధుడవు.దర్శనీయుడవు.

2. ఇంద్రా!వృద్ధుడగు తండ్రిపుత్రుని బోధించినట్లుసకల దేవగణములుఅసురవధకు నిన్ను పురికొల్పుదురు.నీవు సత్య ంకాస స్వరూపుడవు.సర్వ లోకాధీశ్వరుడవు.నీవు జలమునుకట్టిపెట్టినవృత్రుని వధించినావు.అందరిని ప్రసన్నులనుచేయు నదులనుత్ర్వనావు.

3. ఇంద్రా!వృత్రుడు అనుభవములందుఅతృప్తుడు. శిథిలాంగుడు.దుర్విజ్ఞానుడు.అజ్ఞాని. భావాపన్నుడు.జలమును ఆక్రంంచుకునిశయనించినవాడు.అట్టి వృత్రునిపూర్ణిమనాడు వజ్రమునవధించినావు.

4. వాయువుతన బలమునక్షోభింపచేయును.అట్లే పరమ ఐశ్వర్యవంతుడగుఇంద్రుడు అంతరిక్షమునుక్షీణజలనుచేసిపిండివేయును. ఇంద్రుడుబలసంపన్నుడు.మేఘములను భగ్నముచేయును.పర్వతముల రెక్కలుంరుచును.

5. ఇంద్రా!తల్లులు బిడ్డలదగ్గరకు పరుగులిడుదురు.అట్లే మరుత్తులునీ వద్దకు చేరినారు.మరుత్తులవలెనేవృత్రవధకుగానునీవెంట వేగవంతమగురథము సాగినది. ఇంద్రా!నీవు ప్రసరణశీలములగునదులను జలపూర్ణములుచేసినావు. మేఘమునుభగ్నమొనరించినావు.వృత్రుడు ఆక్రంంచినజలమును ండిపించినావు.

6. భూంమహంతము.సకల ప్రాణులకు ప్రియమయినది.'తుర్వీత' 'వయ్యు'జలములతోరమణీయముచేసినావు. జలములనుసులభముగా ప్రవహించునట్లుచేసినావు.

7. నదులుతట ధ్వంసినులు.జలయుక్తములు.అన్న జనయిత్రులు.ఇంద్రుడు శత్రుహింసక సేననువలెనదులను పరిపూర్ణములనుచేసినాడు. జలశూన్యదేశములను వర్షముద్వారా

జలపూర్ణముచేసినాడు. దప్పిగొన్నబాటసారుల దాహముతీర్చినాడు. ఇంద్రుడుదస్యుల గొడ్డుపోతుఆవులపాలు పితికినాడు.

8. ఇంద్రుడువృత్రుని వధించినాడు.చీకట్లు ంగిన ఉషస్సులనుంముక్తము చేసినాడు. సంవత్సరములనుంముక్తము చేసినాడు.వృత్రుడు నిరోధించినజలములనుంముక్తము చేసినాడు.వృత్రుడు చుట్టుముట్టినమేఘములను ంముక్తముచేసినాడు. నదులనుభూంంద ప్రవహించుటకుంముక్తము చేసినాడు.

9. ఇంద్రా!నీవు హర్యాశ్వుడవు.ఉపజిహ్వికలనుపురుగులను తిని, వల్మీకమందున్నఉగ్రపుత్రుని పుట్టనుండివెలికితీసినావు.లోన ఉన్నపుడుఅంధుడగు ఉగ్రపుత్రునకుబయటకి వచ్చినంతచూపువచ్చినది.అతడు సర్పమునుస్పష్టముగా చూడగలిగినాడు.పురుగులు తిన్న అతనిఅవయవములనుమరల సంధించినావు.

10.ఇంద్రా! నీవు ప్రాజ్ఞుడవు.సర్వజ్ఞుడవు. మానవులువర్షాభిలాషులు.స్వయంసమృద్ధులు వర్షసంబంధకార్యములతో నీవుమానవులకు అనేకఉపకారములు చేసినావు.వామదేవుడుఅట్టి సనాతనకార్యములను ఉల్లేఖించుచున్నాడు.

11.ఇంద్రా! నిన్ను పూర్వ్యఋషులుస్తుతించినారు. మేముస్తుతించుచున్నాము.మా స్తుతులకు ప్రసన్నుడవగుము.జలములు నదినిపూరించినట్లు స్తోతలఅన్నమును అభివృద్ధిపరచును. హరింశిష్ట ఇంద్రా! మేము అభినవస్తుతులురచించెదము.అందువలన మేమురథవంతులమయిసర్వదా నీసేవ చేయగలము.
ఈ మంత్రము16-21, 17, 21 తిరిగి ఇచటపునరావృతమయినది.

## ఇరువదవసూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత-ఇంద్రుడు,ఛందస్సు-త్రిష్టుప్

1. ఇంద్రా!నీవు అభీష్టప్రదుడవు.తేజస్విం. జనులకుఆశ్రయ ప్రదానమునకుగానుదూరము నుండిరమ్ము. దగ్గరనుండిరమ్ము. ఇంద్రుడు సంగ్రామమునసంఘటితుడు అగును.శత్రువులనువధించును.అతడు వజ్రబాహువులు,మానవ పాలకులు,తేజస్వులగు మరుత్తులుకూడినవాడు.

2. ఇంద్రుడుమాకు అభిముఖవర్తి.అతడు మాకు ఆశ్రయము,ధనము ప్రదానముచేయవలెను. ఇందుకుఅతడు అశ్వయుక్తుడయిమావద్దకు రావలెను.ఇంద్రుడు వజ్రవంతుడు.ధనశాలి. మహామహుడు.అతడు యుద్ధమునకువెళ్లవలెను.మా యజ్ఞమునకుంచ్చేయవలెను.

3. ఇంద్రా!నీవు మాకు పురస్సరువడగుము.మా యజ్ఞమునకుంచ్చేయుము. ఈ యజ్ఞమును భజింపుము.వజ్రధరా! మేమునీ స్తోతలము.వ్యాధుడు మృగములనువేటాడినటులుం ద్వారా ధనము పొందుటకుయుద్ధమునజయము పొందవలెను.

4. అన్నవంతుడవగుఇంద్రా! నీవు ప్రసన్నమనమున మావద్దకు ంచ్చేయుము.మాకోరికలను తీర్చుము.ఉత్తమ రూపము, అభిషుతము,మాదకమగు సోమపానముచేయుము. మధ్యందిన సవనమునకుంచ్చేయుము. మాస్తోత్రములనుస్వీకరింపుము. సోమపానముచేయుము. హృష్టుడవుఅగుము.

5. ఇంద్రుడుఫలవంతమగువృక్షమువంటివాడు.ఆయుధ కుశలుడగుజయునివంటివాడు. నూతనఋషులచే ధప్రకారములుగ స్తుతించబడువాడు.పురుహూతుడు.స్త్రీలోలుడు స్త్రీనిప్రశంసించిన రీతిమేము ఇంద్రుని స్తుతించెదము.

6. ఇంద్రుడుపర్వతమువలెప్రవృద్ధుడు. మహాహనుడు.తేజస్వి. శత్రువులపరాభవకర్త. అందుకుగానుసనాతనకాలమునఆర్భంచినాడు. ఆ ఇంద్రుడుజలపూర్ణమగు పాత్రవలెతేజోపూర్ణమగుబృహత్ వజ్రమునుఆదరించును.

7. ఇంద్రా!నీవు జన్మించినావు.అయితే నిన్ను నివారించువాడులేకుండినాడు. నీవుయజ్ఞములకుధనము ప్రసాదించినావు.దానిని నాశము చేయువాడులేకుండినాడు. నీవుబలశాలి. తేజస్వి.పురుహూతుడవు.అభీష్ట వర్షి. నీవుమాకు ధనముప్రసాదించుము.

8. ఇంద్రా!నీవు ప్రజల ధనములను,గృహములనుపర్యవేక్షింతువు. అసురులునిరోధించిన గోసమూహములనుముక్తములనుచేయుదువు.బోధన షయమునప్రజల నేతవు,శాసకుడవు. యుద్ధమునప్రహారకుడవు.నీవు అనంత ధనవంతుడవుఅగుము.

9. ఇంద్రుడుతన ప్రజ్ఞాబలమునమాటి మాటికికర్మ సమూహములనుసమకూర్చును. అందువలనఅతడు ప్రాజ్ఞు,జ్ఞానబలుడు.అశేష కీర్తి సంపన్నుడుఅయినాడు. అతడు యజమానులబహుళపాపములను నష్టపరచును.స్తోతలకు ధనప్రదానముచేయును.

10.ఇంద్రా! నీవు మమ్ముహింసించకుము.మాకు పోషకుడవు అగుము.నీవుశేష ధనమునుహవ్యదాతకుఅందింతువు. దానినితెచ్చి మాకు ప్రసాదించుము.మేము నిన్ను స్తుతింతుము.ఇది నూతనము,దాన యోగ్యము,ప్రశస్తమగు ఉక్థ. దీనితోమేము నిన్ను శేషరూపమున కీర్తింతుము.

11.19వ సూక్తమునందలి11వ మంత్రముపునరావృతము. ఆమంత్రమునుచూడనగును.

## ఇరువదిఒకటవ సూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత-ఇంద్రుడు,ఛందస్సు-త్రిష్టుప్

1. ఎవడుశేషబలసంపన్నుడో,ఎవడు సూర్యునివలెపరాభవ సమర్ధబలమును పోషించునోఅతడు మా వద్దకురావలెను. మమ్మురక్షించవలెను.పరాక్రమవంతుడుప్రవృద్ధుడగుఇంద్రుడు మాతో పాటుహృష్టుడు కావలెను.

2. యజ్ఞార్హసామ్రాట్టు వలెపరాభవకారకులు,త్రాతలు, శత్రువులపరాభవ కర్తలు,శేష కీర్తిశాలురు, అతిశయధనశాలురు, ఇంద్రునకుబలభూతులుమరుత్తులు. స్తోతలారా!అటువంటి మరుత్తులనుఈ యజ్ఞమునస్తుతించుడు.

3. ఇంద్రుడుమాకు ఆశ్రయము ఇచ్చుటకుగాను మరుత్తులసహితుడయిస్వర్గలోకమునుంచి,భూలోకము నుంచి,అంతరిక్షమునుంచి,జలముల నుంచి,ఆదిత్యలోకమునుంచి,దూరదేశమునుంచి,జలస్థానమగుమేఘలోకమునుంచిఇచ్చుటకి చ్చేయవలెను.

4. ఇంద్రుడుస్థూలము మరియుభారమగు ధనములకుఅధిపతి. ప్రాణరూపబలమున శత్రుసేననుజయించగలవాడు.ప్రగల్భుడు. స్తోతలకుధనదాత. యజ్ఞస్థలమునమేము ఆ ఇంద్రుని స్తుతించెదము.

5. ఇంద్రుడుఅఖిలలోకములనుస్తంభింపజేసి యజ్ఞార్హముగర్జనశీల ధ్వనినిఉత్పన్నము చేయును.హవ్యముఅందుకొనును. వర్షముకలిగించి, అన్నదానముచేయును. అలంకారయోగ్యమగు ఉక్థలలోస్తూయమానుడు.అట్టి ఇంద్రుని యజ్ఞగృహమునకుహోతలు ఆహ్వానింతురు.

6. ఇంద్రునిస్తుతించు అభిలాషకలవారు,యజమాని గృహముననివసించువారు, స్తుతిసహితులయిఇంద్రునివద్దకువెళ్ళినపుడు ఇంద్రుడుఃచ్ఛేయవలెను.ఇంద్రుడు మాకు యుద్ధమునసహకరించవలెను.అతడు యజమానులకుహోత. అతని క్రోధముదుస్తరము. "ఆదురోషా:"

7. ఇంద్రుడుజగత్ భర్త.ప్రజాపతి పుత్రుడు.అభీష్ట వరదుడు.అట్టి ఇంద్రుని బలముస్తోత్రకారుడగు యజమానినిరక్షించును. ఆ బలముయజమాని హృదయకుహరమును,కర్మములందునునిలిచి ఉండును.యజమాని అభీష్టప్రాప్తికి,అతని ఆనందమునకుగాను వాస్తవముగా ఆబలము ఉత్పన్నమయినది.ఇంద్రుని బలముయజమానిని సర్వదాపాలించును.

8. ఇంద్రుడుమేఘద్వారములనుఅపావృతము చేసినాడు.తెరచినాడు. జలవేగమునుజలసమూహములద్వారా పూరించినాడు. అందువలననేఇంద్రునకు అన్నదానముచేసిన యజమానిఇంట " గౌరమృగము" గవయయుగము చేయును.
(గవయస్యగవయ మృగస్యచఅని శాయణుడు)

9. ఇంద్రా!నీ హస్తద్వయముకళ్యాణ కారకము, సత్కర్మఅనుష్ఠాన కర్త. నీ హస్తద్వయము యజమానికిధన ప్రదానముచేయును.
ఇంద్రా!నీ స్థితి ఎట్టిది?ఏలనీవు మమ్ములసంతృప్తులను చేయవు?మాకు ధనముప్రసాదించుటకు నీవుఏల హృష్టుడవుకావు?

10.ఈ ఃధముగా స్తుతించబడినసత్యవంతుడు,ధనవంతుడు,వృత్రహంతఇంద్రుడు యజమానులకుధనము ప్రసాదించును.ఇంద్రా! మా స్తుతులకుగాను ధనదానముచేయుము. అదిమాకు దివ్యాన్నభక్షణకుఉపయోగపడవలెను.

11.19వ సూక్తము నందలి11వ మంత్రముపునరావృతము. ఆమంత్రమునుచూడనగును.

(ఆంధ్రవచన ఋగ్వేదసంహిత మూడవఅష్టకము నాలుగవమండలము, ఆరవఅధ్యాయమున రెండవఅనువాకము సమాప్తము)

## మూడవఅనువాకము

## ఇరువదిరెండవ సూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత-ఇంద్రుడు,ఛందస్సు-త్రిష్టుప్

1.ఇంద్రుడుమహాబలవంతుడు.మేము సమర్పించుహఃరన్నముస్వీకరించును. అతడు ధనవంతుడు.వజ్రము ధరించును.బలయుక్తుడుఅగును. ఃచ్ఛేయును.ఇంద్రుడు హవ్యము,స్తోమము, సోమము,ఉక్థ స్వీకరించును.

2. ఇంద్రుడుఅభీష్టవర్షి అతనిబాహువులందువజ్రము ఉన్నది.అది వర్షకారకము. చతుర్ధారావశిష్టము.అతడు దానిని శత్రువులఃదకు ఃసరును. ఇంద్రుడుఉగ్రుడు. నేతృ శ్రేష్ఠుడు.కర్మవంతుడు. ఆచ్ఛాదనకారిణిఅగు 'పురుష్ణి' నదిని ఇంద్రుడుసేఃంచును. అతడు'పురుష్ణి' నది భిన్నప్రదేశములనుస్నేహమునకుగాను సంయుతముచేయును.

3. ఇంద్రుడుదీప్తిమంతుడు.దాతృ శ్రేష్ఠుడు. పుట్టుకతోనే విశేష అన్నవంతుడు.బలవంతుడు.ఇంద్రుడు ఉభయబాహువులందువజ్రము ధరించినాడు.ఇంద్రుని వలెప్రేరితమయిన వాయువుమానవునివలెధ్వని చేయును.

4. ఇంద్రా!నీవు మహానుడవు.ప్రగల్భుడవు.శూరుడవు. నీ కార్యములుగొప్పవి. సమస్త సవనములందుస్తుతియోగ్యుడవు.సమస్త లోకములనుభరించగలవాడవు.ఘర్షణశీల వజ్రముధరించినావు. బలపూర్వకముగా'అహి'ని వధించినావు.

5. నీవుఅధిక బలశాలివి.నీ సకల కర్మలు సునిశ్చితముగాసత్యములు. నీవుఅభీష్టవర్షివి. నీ భయమువనేఆవులు తమ పొదుగులందుపాలను రక్షించుచున్నవి.నదులు నీ భయమువనేవేగముగా ప్రవహించుచున్నవి.

7. నీవుహర్యశ్వవంతుడవు.వృత్రుడు చాలకాలమునదులను బంధించిఉంచినాడు. నీవు అట్టినదులను విముక్తముచేసినావు. అప్పుడేప్రసిద్ధ ద్యుతిమతులగునదులను నీవురక్షించినావు. అందుకునదులు నిన్నుకీర్తించినవి.

8. హర్షజనకసోమము పిండబడినది.అది స్పందమానము.ఆ సోమము ఇంద్రునివద్దకు చేరవలెను.వడి గల గుర్రమునుకళ్ళెము పట్టిప్రేరేపింతురు. అట్లేదీప్తిమంతమగుస్తోత్రమునుప్రేరేపింపుము.

9. సహనశీలుడవగుఇంద్రా! నీ బలముప్రశస్తము. అది శత్రుపరాభవ కారకము.ప్రవృద్ధము. అట్టిబలమును మాకుప్రసాదించుము. చంపదగినశత్రువులనుమాకు అప్పగింపుము. హింసకులగుమానవుల అస్త్రములననష్టపరచుము.

10.ఇంద్రా! నీవు మా స్తుతులనువినిపించుకొనుము. మాకువివిధప్రకార అన్నములనుప్రసాదించుము. సమస్తబుద్ధులనుప్రేరేపించుము. మాకుగోదాతవు అగుము.

11.19వ సూక్తమునందలి11వ మంత్రముపునరావృతము ఆ మంత్రమునుచూడనగును.

## ఇరువదిమూడవ సూక్తము

ఋషి-వామదేవుడు,దేవత-ఇంద్రుడు,ఛందస్సు-త్రిష్టుప్

1. మాస్తుతి మహాఇంద్రుని ఎట్లు వర్ధిల్లచేయును?ఏ హోత యజ్ఞమునకుఇంద్రుడు ప్రీతుడుఅయి విచ్చేయగలడు?ఇంద్రుడు సోమరసమునుఆస్వాదించును. అన్నమునువాంచించు, సేవించుచుమా యజమానికిప్రదానము చేయుటకుప్రదీప్త ధనమునుగ్రహించును.

2. ఎంతటివీరుడు ఇంద్రునితో సోమపానముచేయగలడు?ఎవడు ఇంద్రుని అనుగ్రహపాత్రుడు కాగలడు?ఎప్పుడు ఇంద్రుని విచిత్రధనవితరణ జరుగును?ఎప్పుడు ఈ స్తోతలుయజమానిని వర్ధిల్లచేయుటకురక్షాయుక్తులు అగుదురు?కంకణము కట్టుకుందురు?

3. ఇంద్రా!నీవు పరమ ఐశ్వర్యయుక్తుడవు.అట్లయి స్తోతలకథాగానమును ఏలవిందువు? మా స్తోత్రములువిందువు సరి. స్తోతలగుహోతల రక్షణకథను ఏల యోచింతువు?ఇంద్రుని సనాతనదానం ఎయ్యది? ఆ దానముఇంద్రుని స్తోతలకోరికలు తీర్చునదిఅని ఎందుకు అందురు?

4. యజమానులుబాధలలో ఉన్నపుడుఇంద్రుని స్తుతింతురు.యజ్ఞములుచేతురు. దీప్తివంతులుఅగుదురు. వారు ఏ విధముగాఇంద్రుని ధనమునుపొందుదురు? ద్యుతిమంతుడగుఇంద్రుడు హవ్యముగ్రహించును.ప్రసన్నుడు అగును.అప్పుడు ఇంద్రుడు మాస్తుతులను విశేషరూపమునఏల ఎరుంగును?

5. ద్యుతిమంతుడగుఇంద్రుడు ఉషోదయముకాగా మానవుల బంధుత్వమునుఏల స్వీకరించును? హోతలుఇంద్రునకు సుయోగ్యముకమనీయమగు హ◌సమర్పింతురు. వారి ◌షయమునఇంద్రుడు ఎప్పుడు ఎట్లుతన బంధుత్వమునుప్రకటించును?

6. నీవుఇంద్రుడవు. మేముయజమానులము.నీ మైత్రి శత్రుపరాభవకారి. స్తోతలముందుదానిని ప్రకటించుటఎట్లు? ఎన్నడు మేమునీ భ్రాతృత్వప్రచారము చేయగలము?ఇంద్రుడు సుదర్శనుడు.మంచి దర్శనములవాడు. అతని ప్రయత్నముస్తోతల కళ్యాణమునకేఅగును. ఇంద్రుని రూపముసూర్యుని వలె గతిశీలము.అతీవ దర్శనీయము.ఇంద్రుని రూపము అందరిఅభిలషణీయము.

7. రాక్షసిద్రోహము చేయునది.హింసించునది.ఇంద్రుని గుర్తించనిది.దానిని హతమార్చుటకుఇంద్రుడు పదునైనఆయుధములకుమరింత పదునుపెట్టును. ఋణముసహితము మమ్ము ఉష:కాలముననే బాధించును.ఇంద్రుడు ఋణ◌నాశకుడు. బలవంతుడు.అతడు అట్టి ఉషలనుదూరము నుండియేఅజ్ఞాతముగా పీడించును.

8. ఋతదేవునివద్ద ఎంతో జలమువున్నది. అతనిస్తుతి పాపములనునష్టపరచును. అతనిబోధ యోగ్యము.దీప్తిమంతము.అది నరుల చె◌టిచెవులందుసహితము ప్రవేశించును.

9. ఋతదేవుడువపుష్మంతుడు. బలవానుడు.ధర్త. ఆహ్లాదకుడు.ఇట్లు అతనికి నానారూపములుకలవు. జనులుఋతదేవుని◌శేష అన్నము కోరుదురు.ఋతదేవునిద్వారా గోవులు దక్షిణరూపమున యజ్ఞమునప్రవేశించును.

10.స్తోతలు ఋతదేవునివశపరచుకొనుటకుఅతనిని భజింతురు.అతని బలముశీఘ్రము. అది జలమునువాంఛించునది.◌స్తీర్ణములు, దురవగాహములగుద్యావాపృథ్వులు ఋతదేవునివే!ప్రీతినామకులుఉత్కృష్టలు ద్యావాపృథ్వులు ఋతదేవునకుగాను పాలు పిదుకును.

11.19వ సూక్తమునందలి11వ మంత్రముపునరావృతము. ఆమంత్రమునుచూడనగును.

## ఇరువదినాలుగవ సూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత-ఇంద్రుడు,ఛందస్సు-10 అనుష్టుప్◌గిలిన◌ త్రిష్టుప్

1. మాకుధనము కావలెను.మాకు ఇంద్రుడు అభిముఖుడుకావలెను. అందుకుఇంద్రుని ఎంతటి సుందరస్తుతులతో స్తుతించవలెను?ఇంద్రుడు ◌ిరుడు. పశుపాలకుడు. అతడు మాకుశత్రువుల ధనముతెచ్చి ఇవ్వవలెను.యజమానులారా!ఇంద్రుని స్తుతించుడు.

2. వృత్రునిఇంద్రుడు వధించవలెను.అందుకు అతనికి సంగ్రామమునుంచి ఆహ్వానమువచ్చినది. ఇంద్రుడుస్తుతియోగ్యుడు.అందముగా స్తుతించినయజమానులకుధనమును ఇచ్చును.అందుకు అతడు సత్యధనుడుఅగును. యజమానిస్తోత్రాభిలాషి,ధనాభిలాషి,ధనవంతుడుఇంద్రుడు యజమానికిధనదానముచేయును.

3. మానవులుయుద్ధమునఇంద్రునే ఆహ్వానింతురు.యజమానులుతపస్సు చేయుదురు.దేహమునుక్షీణింపచేతురు.ఇంద్రునే తమరక్షకునిగా భా◌ంతురు. యజమానులుస్తోతలు పరస్పరముకలిసెదరు. వారు పుత్రపౌత్ర లాభమునకుగాను ఇంద్రుని దరికిచేరుదురు.

4. ఇంద్రా!నీవు బలవంతుడవు.మానవులు నాలుగుదిశలందువ్యాపించిఉన్నారు. వారు జలలాభమునకుగానుకూడుదురు. యజ్ఞముచేయుదురు. యుద్ధముచేయువారు కూడుదురు.అప్పుడు అందరు ఇంద్రునినేఅభిలషింతురు.

5. అప్పుడుఒకడు బలవంతుడగుఇంద్రుని పూజించును.ఒకడు ఇంద్రునకు పురోడాశముసమర్పించును.అంతటసోమాభిషవముచేయు యజమానిఅనభిషవ యజమానినివేరు చేయును.అప్పుడు ఒకడు అభీష్టవర్షిఇంద్రుని గురించి యజ్ఞముచేయ తలపెట్టును.

6. ఇంద్రుడుసోమాభిలాషి, స్వర్గలోకస్థితుడు. ఇంద్రునికొరకు అభిషవము చేయువారికి అతడు ధనదానముచేయును. ఏకాంతచిత్తమునఇంద్రుని అభిలషించువారుఉన్నారు. సోమాభిషవముచేయు యజమానులుఉన్నారు. ఇంద్రుడు అట్టివారితో స్నేహముచేయును.
("సధ్రీచీనేనసంగతేనమనసా"అని ఏకాంత చిత్తమునఅని అర్థము. మానసికఏకాగ్రతను గురించిఇచటనే ప్రబోధించినాడు.ఇది తొలిసారి. ఇంతకుముందుకనిపించలేదు)

3వమంత్రమునతపస్సు దేహమునుక్షీణింపచేయుటనుగురించియు తొలిసారి చెప్పినాడు.ఇది కర్మము నుంచిజ్ఞానమునకుదారివలె కనిపించుచున్నది.

7. ఒకడుఇంద్రుని కొరకు సోమాభిషవముచేయును. ఒకడుపురోడాశము సమర్పించును.ఒకడు పేలాలకు వేపదగినయవలను వేపును.ఒకడు స్తుతించును.ఇంద్రుడు అట్టియజమానులకోరికలు తీరునంతటిబలమును ప్రసాదించును.

8. శత్రుహింసక స్వా౦ు ఇంద్రుడుశత్రువులనుగుర్తించినపుడు ఇంద్రుడుదీర్ఘ సంగ్రామమునవ్యాపించి ఉన్నపుడుఇంద్రపత్ని సోమాభిషవకర్త ఋత్వికుని ద్వారాసోమపానము చేయుటకుఉత్సాహము కనబరచుఇంద్రుని యజ్ఞగృహమునకుఆహ్వానించును.

9. ఒకనికిఅధిక పుణ్యమునకుఅల్పధనములభించును.అతడు కొన్నవాని వద్దకువెళ్ళును. నేనుఅమ్మలేదు. నాకు౦గిలిన ధనముఇవ్వవలసినదిఅని అడుగును. కొన్నవాడుచాలా ఇచ్చినానుఅని అల్ప మూల్యమునుపెంచి ఇవ్వడు. సమర్థుడుకాని అసమర్థుడు కాని ఖరీదుచేసినప్పటిమాటనిలిచి ఉండును.

10.మా ఇంద్రుని పది ఆవులుఇచ్చి ఎవడు ఖరీదుచేయును? ఇంద్రుడుశత్రువులనువధించినంతనా ఇంద్రుని నాకు అప్పగించవలెను.

11.19వ సూక్తమునందలి11వ మంత్రముపునరావృతము. దానినిచూడగలరు.

## ఆలోచనామృతము

1. మానవచరిత్రకు ఆద్యంతములులేవు. ఇది కాలముసహితముగానిరంతరము సాగుచునేఉండును. ఈ చరిత్రగమనమున మానవుడుఒకప్పుడు పురోగతుడగును.మరొకపుడు తిరోగతుడగును.

మానవగమనమునకు నిర్దిష్టబిందువు లేదు.కావున పురోగమనతిరోగమనములనుస్పష్టముగా చెప్పజాలము.అప్పుడు గమనముసాపేక్షమగును. అప్పటిస్థితిని బట్టివెనుకకా? ముందునకా?అని కాని అది కూడ నిర్దిష్టముకాదు. మానవ జీ౦తముఏకముఖము కాదు.ఇది బహుముఖీనము.ఆర్థికము, పారమార్థికము,సామాజికము ఇట్లులెక్కలేనన్ని?ఇందు ఎందున సాపేక్షముగముందడుగు వెనుకడుగునిర్ణయించుట మానవునకుఅసాధ్యము.

ధనమున్నవానికి శాంతి, శాంతి ఉన్నవానికిధనము కరువగును.ఇది సూచన మాత్రమే!పరిపూర్ణత ప్రకృతికిలేదు. కావునజీ ంతమునకు లేదు.సృష్టిలోనయినను,అతీతముగా అయిననుపరమేశ్వరుడు ఒక్కడేపరిపూర్ణుడు.

అయిననుమానవుని గమనమునిలవదు! దానికినిర్దిష్ట లక్ష్యములువుండవు. అది ఉన్నదిఅనుకొనుట భ్రమ!జీ తమే ఒక భ్రమకదా!

2. ఈసూత్రపు మూడవమంత్రము “రిరిక్వా సంస్తవ:కృణ్వత” అన్నాడు.అనిన శరీరమును క్షీణింపచేసుకునితపస్సు చేయుటఅని అర్థము.

మానవునకుప్రధానమయినదికర్మ, పని, పని లేనిదిమానవుడు మనజాలడు.పని తరువాత అవసరమయినదియజ్ఞము, ప్రయత్నము.కర్మకాండ అని పేరొందినఒక ధి ధాన యజ్ఞము.మానవులకు సౌఖ్యములుసమకూర్చుటకు ఏర్పడినది.ఇది భగవదారాధనము.

యజ్ఞమునకుసాధన సంపద సమకూర్చువాడుఒకడు. అతడు యజమాని.యజ్ఞమునుజరిపించువాడొకడు.అతడు ఋత్విక్కు.యజమానికికర్మకాండతోగాని, ఋత్విక్కునకుసాధన సామగ్రితోకానిసంబంధము లేదు.తపస్సు అటువంటిదికాదు. సంపూర్ణ స్వప్రయత్నయుక్తము.దీనికి చేయువాడు,చేయించువాడు ఉండరు.

స్వసంకల్పముస్వప్రయత్నము.ఇచట దేహమేయజ్ఞభూ .సంకల్పమే ఋత్విక్కు.ఇది జ్ఞానమునకుమార్గము కావచ్చును.

3. “ఋతము”ఇది వేదమునఅతి ప్రధాన పదము.దీనిని దయానందసరస్వతి “సత్యము”గను.శాయణాచార్యులుయజ్ఞముగనువ్యాఖ్యానించినారు.

23-8మంత్రమునవచ్చిన ఋతమునకుశాయణుడు “ఋతశబ్దేనేంద్రోవా దిత్యోవాసత్యంవా యజ్ఞోవాఉచ్యతే” అని అనేకఅర్థములను చెప్పినాడు.ఋతము “సత్యము”అని నా అభిప్రాయము.సత్యము అనిన నిజముచెప్పుట మాత్రముకాదు. ‘సత్’ ఉన్నది.‘అసత్’ లేనిది. సద్వివేకముఉన్నదిలేనిది టిని గురించి జ్ఞానము.సకల చరాచర ప్రపంచముఅసత్. ఉండునది కాదు.వచ్చిపోవునది.దీనికి స్థిరత్వము,శాశ్వతత్వము లేదు.
‘సత్’ఉన్నది. శాశ్వతమైనది.పరమాత్మ స్వరూపము.
అర్థముజీ తమును ఎరుగుట.పరమార్థము పరాత్పరునిఎరుగుట. పరాత్పరుడుఎవడు? అదియే మానవునకుఎన్నటికి తెలియనిది.ప్రస్తుతము మనము శ్వసించినవాడే ఈశ్వరుడు.ఇది శ్వాసము మాత్రమే!

మానవునిఆలోచనకు గోచరించనిఒక మహా పదార్థముపరమాత్మ. పరమేశ్వరుడు.పరంధాముడు. అతడే‘ఋత్’ కావునఋతమే సర్వమునకుకారణము అని చెప్పినాడు.
ఋతముభౌతికము కాదు.
4.24-9,10 పణి మార్కెట్నుగురించి వరించిన .
ఒకపదార్థమునకు వ్యాపారిస్వల్ప మూల్యముఇచ్చును. స్వల్పమూల్యము ఇచ్చువాడేవ్యాపారి.
ఉత్పత్తిదారునకులేదా నియోగదారునకు“మూల్యము”తెలియదు.
మోసపోవువాడేఉత్పత్తిదారుడు, నియోగదారుడు.

అ్మనవాడుఅసలు షయము తెలిసికొనికొన్నవాని వద్దకువెళ్ళును. అతడునిబంధన వల్లించును.“ ప్రదుహన్తిమథోక్తం క్రియకాలేతద్వై లభతే”అని శాయణ వ్యాఖ్య.కొనుగోలు జరిగినప్పటిమాటయే నిశ్చయముఅనును కాని అణు మాత్రముఎక్కువ ఇవ్వడు.

ఇదిఎంతటి జీ౦తసత్యము! దీనికి వేదకాలమునుంచి కంప్యూటర్‌కాలము వరకు మార్పులేదు!! అందుకే అదివేదము అయినది.

10వమంత్రమున'కొనుగోలు' కానిది 'అద్దె'వంటిది ఏదో చెప్పబడినది.ఇంద్రుడు సంకేతముమాత్రమే. ఒక వ్యక్తిలేక పదార్థమునుఅవసరమునకుగానుద్రవ్యము ఇచ్చితీసుకుని అవసరము
తీరినవెనుక అప్పగించుట'లీజ్' వంటిది!అది వేదమునవున్నది!!

ఇరువదిఅయిదవ సూక్తము

ఋషి-వామదేవుడు,దేవత-ఇంద్రుడు,ఛందస్సు-త్రిష్టుప్

1. హితకరుడు,దేవతాభిలాషి,కోరికలు గల మానవుడుఎవడు ఇంద్రునితోమైత్రికోరును? సోమాభిషవకారియగుఏ వ్యక్తి అగ్నిని ప్రజ్వలింపజేసిఇంద్రుని మా ఆశ్రయలాభము కొరకు స్తుతించును?

2. ఎవడుఏ యజమాని స్తుతివాక్యముల ద్వారా సోమార్హుడగుఇంద్రుని ముందు అవనతుడుఅగును? ఎవడు ఇంద్రునిస్తుతించగోరును?ఎవడు ఇంద్రుడుదానము చేసినగోవులను అందుకొనును?ఎవడు ఇంద్రుని సాహచర్యమువాంఛించును? ఎవడుఇంద్రుని స్నేహముకోరును? ఎవడు ఇంద్రునిభ్రాతృభావమునువాంఛించును? ఎవడుక్రాంతదర్శనుడగుఇంద్రుని ఆశ్రయముకొరకు ప్రార్థించును?

3. నేడుఏ యజమాని ఎవడుఇంద్రాది దేవతలనుతన రక్షణకుగానుప్రార్థించును? ఎవడు ఆదిత్యుని,అదితిని, జలమునుప్రార్థించును? ఎవని౦షయమున అశ్వద్వయము,ఇంద్రుడు అగ్నిస్తుతులకుప్రసన్నులు అగుదురు?వారు ఏ యజమాని అభిష౦౦చినసోమమును యథేచ్ఛగాపానము చేయుదురు?

4. ఇంద్రుడుమానవనేతలబంధువు. నేతలలోశ్రేష్ఠుడగు నేత.అట్టి ఇంద్రునికొ౦అకుసోమము అభిష౦౦చినయజమానులకుహ౦ర్భర్త అగ్నిసుఖములను ప్రసాదించును.వారు చిరకాలము నుంచిఉదయించుచున్నసూర్యుని దర్శింతురు.

5. ఇంద్రునికొ౦అకు సోమాభిషవముచేయు
యజమానినిఅల్పశత్రువులుగానిఅధికశత్రువులుగానిబాధించరాదు.ఇంద్రమాత అదితివారికి అధికసుఖములుప్రసాదించవలెను.శోభనయజ్ఞయాగములుచేయు యజమానులుఇంద్రునకు ప్రియులుకావలెను. ఇంద్రునిస్తుతించగోరువారు ఇంద్రునకుప్రియులుకావలెను.ఇంద్రునివద్దకుసాధుభావమునచేరువారు ఇంద్రునకుప్రియులు కావలెను.సోమవంతుడగుయజమాని ఇంద్రునకుప్రియుడు కావలెను.

6. ఇంద్రునివద్దకు వెళ్లువాని,సోమాభిషవముచేయువాని పాక కార్యమును౦క్రాంతుడగు ఇంద్రుడుస్వీకరించును. సోమాభిషవముచేయవానికి ఇంద్రుడు౦క్రాంతుడుకాడు. ౦త్రుడుకాడు.బంధువుకాడు.ఇంద్రుని వద్దకువెళ్లనివానిని, ఇంద్రునిస్తుతించనివానినిఇంద్రుడు హింసించును.

7. ఇంద్రుడుఅభిషుత సోమపాయి.అతడు ధనికుడు.లోభి, వ్యాపారితో స్నేహముఏర్పరచుకొనడు. వాడినిరర్థక ధనమునుఉద్ధరించడు - నష్టపరచును.

8. ఇంద్రుడుసోమాభిషవకారి, హవ్యపాకకారి.యజమానులకుఅసాధారణ బంధువగును.

9. ఉత్కృష్టులు,నికృష్టులు ఇంద్రునిఆహ్వానింతురు. మధ్యములుఇంద్రుని ఆహ్వానింతురు. నడచువారుఇంద్రుని ఆహ్వానింతురు.నిలుచువారు ఇంద్రునిఆహ్వానింతురు. గృహములందున్నవారుఇంద్రుని

ఆహ్వానింతురు.యుద్ధమునందున్నవారుఇంద్రుని ఆహ్వానింతురు.అన్నమును కోరువారుసహితము ఇంద్రునిఆహ్వానింతురు.

## ఇరువదిఆరవ సూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత 1 - 3 ఆత్మ,4 - 7 శ్యేనము, ఛందస్సు- త్రిష్టుప్

1. మేముప్రజాపతులము.మేమే అందరిని ప్రేరేపించుసంతము. మేమే దీర్ఘతమఋషి పుత్రుడు,మేధాం, కక్షీవంతఋషులము. మేమేఅర్జునపుత్రుడు కుత్సునితరింపచేసినాము. మేమేఅశ్ననామక కవులము.నరులారా! మమ్ముచక్కగా దర్శించుడు.

2. మేముఆర్యునకు భూంు దానముచేసినాము. హవ్యదాతలగుమానవులకు సస్యాభివృద్ధి, వర్షముదానము చేసినాము.శబ్దించు జలములనుఉద్ధరించినాము.దేవ గణములుమా సంకల్పమునుఅనుసరింతురు.

3. మేముసోమపానమున ఉన్మత్తులమయిశంబరుని తొంబదితొంమ్మది నగరములనుధ్వంసము చేసినాము.యజ్ఞమున అతిథులనుఆదరించు దివోదాసునిరక్షించినాము. అప్పుడుఅతని నివాసమునకుగానుదివోదాసునకు నూరునగరములు ఇచ్చినాము.

4. మరుత్తులారా!శ్యేనపక్షి పక్షులలోప్రధానమయినది.అన్య శ్యేనములకన్నశీఘ్రుగాంు. శ్యేనము ప్రదానతరము.సోమరూప హవ్యముదేవతలు సేంంచునది.దానిని స్వర్గమునుండిమానవుల కొఱకుచక్రములేనిరథము - శ్యేనముతెచ్చినది.

5. శ్యేనముస్వర్గము నుండి సోమముతెచ్చునపుడుభయభీతమయినది.ంస్తీర్ణ అంతరిక్షమున ఎగురునపుడుమనోవేగముననసాగినది. అది సోమమయమధుర అన్నమువహించి సాగినది.సోమము ఈ లోకమునకుతెచ్చినందున'సువర్ణ' అయినది. అందువలనఈ లోకము తేజోవంతమయినది.

6. శ్యేనముదేవతల సహచరి.ఋజుగాంు. ప్రశంసనీయగమన.అది స్తుతియోగ్యము,మాదకమగు సోమమునుద్యులోకమునగ్రహించునది.దృఢచిత్తమునసోమమును చేర్చినది.

7. శ్యేనపక్షిసహస్ర, అయుతసంఖ్యాక యజ్ఞసహితముగాసోమము గ్రహించినది.దానిని చేర్చినది.అట్లు తెచ్చినసోమమును బహుకర్మావశిష్టుడు,ప్రాజ్ఞుడగు ఇంద్రుడుసేంంచినాడు. సోమముసేంంచుట వలనకలిగిన హర్షాతిరేకమునమూఢశత్రువులనువధించినాడు.
(సోమముస్వర్గము నుండి తేబడినదనిగాథ. దానిని గాయత్రిశ్యేనరూపమున భూలోకమునకు తెచ్చినది.అందుకే శ్యేనము "సువర్ణ"అయినదని శాయణాచార్యులు)

## ఇరువదిఏడవ సూక్తము

### ఋషి-వామదేవుడు,దేవత - శ్యేనము,ఛందస్సు - చివరిదిశక్వరి, ంగిలినం త్రిష్టుప్

1. గర్భమునందుండియేమేము, వామదేవుడుసమస్త దేవతలజన్మమును యథాంధిగాతెలిసికొన్నాము.పరమాత్మనుండియేసమస్త దేవతలుపుట్టినారు. అనేక లోహమయశరీరములు మమ్మురక్షించినం. ఇప్పుడు మేముశ్యేనరూపులము. ఆవరణరహిత ఆత్మనుఎగిరినాము. దేహమునుండిబయటపడుదుము.**"శ్యేనోజవసానిరదీయమ్"**

2. ఆగర్భము మమ్ముపూర్తిగా అపహరించలేదు.మోహము కలిగించలేదు.మేము గర్భస్థ దు:ఖమునుమా జ్ఞాన సామర్థ్యమునపరాజితము చేసినాము.అందరిని ప్రేరేపించు పరమాత్మగర్భస్థ

శత్రువులనువధించినాడు.వర్ధమానుడయిగర్భమునందలిక్లేశకారక వాయువులను అతిక్రమించినాడు.

3. ద్యులోకమునుండి శ్యేనము సోమమునుఅపహరించినది.అధోముఖియై శబ్దముచేసినది. అప్పుడుసోమపాలకులు శ్యేనమునుండి సోమముగుంజుకున్నారు. అప్పుడు'కృశానుడు' అనుసోమపాలకుడు బాణమునుఎక్కుపెట్టినాడు. శ్యేనముపైవిడిచినాడు. అప్పుడుశ్యేనము సోమముతెచ్చినది.

4. అశ్వద్వయముఇంద్ర విశిష్ట దేశమునుండిభుజ్యుని అపహరించినట్లుఋజుగామి శ్యేనము ఇంద్రరక్షితమహాద్యులోకమునుండిసోమము అపహరించినది.అప్పటి యుద్ధమునకృశానుని అస్త్రముతగిలి గమనశీలపక్షియొక్క ఒక మధ్యస్థిత- పతనశీల పక్షమురాలినది.

5. ఇప్పుడుశ్రవంతుడగు ఇంద్రుడు- శుభపాత్రస్థితము,గవ్యమిశ్రితము,తృప్తికారకము, సారసమన్వితము,అధ్వర్యులద్వారా ప్రదత్తమగుసోమ లక్షణ అన్నమును,మధుర సోమరసమునుహర్షార్థియైఇంద్రుడు ముందేపానము చేయవలెను.

## ఆలోచనామృతము

1. 18వసూక్తములో గర్భస్థుడగువామదేవుని సంవాదమువంటిదేఈ సూక్తమునందలి సంవాదము.
ఇదిజ్ఞానరూపమునఆత్మను విముక్తముచేయుట అని ఒక వ్యాఖ్యఅన్ని బంగారుబంధములనువదిలించుకొనిబయటపడుట.

ఇదిఒక రకపు యోగ ప్రక్రియవలెఉన్నది. ఉదానప్రాణముశ్యేనవేగమునబయల్వెడలుట. ఆ విధముగామరొక దేహమునప్రవేశించుట.

2. గర్భస్థమోహమునుజయించినాము. అదియుజ్ఞానము. ఒక ఐతిహ్యముగుర్తుకు వచ్చినది.శఠగోపయతి జన్మించగనేమోహవాయువు,శఠము విడిచినదట.ఆసద్యోజాత శిశువుశఠమును కోపించినాడట.అది అతనిని అంటలేదు.సహజ రోదనములేని బిడ్డనుతలిదండ్రులుచింతచెట్టుతొఱ్ఱలో వేసినారు.అక్కడనే
పెద్దవాడయినశఠగోపయతి నాలాయిరద్రావిడవేదమగుతిరువాయ్‌మొళిపాడినారు.
పూర్వజన్మవిషయమున విశ్వాసముఉన్నవారికి ఇది అంతవింతగాతోచదు.
శ్రీశుకుడుజన్మతోనే యోగిఅయినాడు.
భౌతికముగఆలోచించిన ప్రసవవేదననునివారించుటకు జరిగిననిరంతర ప్రయత్నముననిది ఒక మజిలీకావచ్చును.

3. శ్యేనగాథగరుడుని అమృతాపహరణగాథకు మూలమువలెకనిపించుచున్నది.

### ఇరవదిఎనిమిదవ సూక్తము

### ఋషి- వామదేవుడు,దేవత - ఇంద్రుడు,సోముడు; ఛందస్సు- త్రిష్టుప్

1. సోమా!ఇంద్రుడు నీతో మైత్రిచేసినాడు. ఇంద్రుడునీ సాయమున నరులకొఱకు జలమును ప్రవహింపచేసినాడు.వృత్రుని వధించినాడు.సింధుజలములనుప్రేరేపించినాడు. వృత్రుడు నిరోధించినజలములనువిముక్తము చేసినాడు.

7.ఇంద్రుడు ఆ ౦రాట్ దానవవృత్రునిం౦ద ౦జయవజ్రమును ఎత్తినపుడువజ్రముతో వృతునిప్రహారము చేసినపుడుఅందరి ప్రాణులలోవృత్రుని నీచునిచేసినాడు - ఇంద్రుడు.

8.వృత్రుడు గమనశీలమహా మేఘములనుఆక్ర౦ంచి శయనించినవాడు.సంహారకుడు. అందరినిఆచ్ఛాదించినవాడు.ఉగ్ర ఇంద్రుడు అట్టివృత్రుని పట్టినాడు.యుద్ధమునపాదరహితునిపరిమాణ రహితునిచేసినాడు. తన౦రాట్ వజ్రమునవృత్రుని కూల్చినాడు.

9.ఇంద్రుని యొక్క ఇతరులనుశోషింప చేయు బలమునుఎవడు నివారింపగలడు?ఇంద్రుడు అప్రతి ద్వంద్వి.ఒక్కడే శత్రువులధనమును హరించును.ద్యుతిమంతములగుద్యావాపృథ్వులు వేగవంతుడగుఇంద్రుని బలమునకుభయపడి వెంటనేకదిలిన౦.

10.స్వయముగా భరించగలద్యుతిమంతద్యుతిమంతద్యులోకము ఇంద్రునిముందుకొంచమై సాగును. అభిలాషగలస్త్రీవలె భూ౦ఇంద్రునకు ఆత్మార్పణముచేయును. ఇంద్రుడుతన సమస్త బలమునుప్రజల మధ్యస్థాపించినపుడు మానవులుబలశాలియగు ఇంద్రునకునమస్కరింతురు.

11.ఇంద్రా! నీవు మానవులలోముఖ్యుడవనిసజ్జనపాలకుడవనిపంచజనుల హితముకొఅకు జన్మించినావనిమాకు ఋషులు చెప్పగా౦న్నాము. నీవు యశోవంతుడవు.రాత్రింబవళ్ళుస్తుతించునట్టి- తమ కోర్కెలనువ్యక్తపరచగలట్టిమా సంతానము స్తుతియోగ్య ఇంద్రుని అనుగ్రహమునకుపాత్రము కావలెను.

12.ఇంద్రా! నీవు సమయానుసారముజంతువులనుప్రేరేపింతువని స్తోతలకుధనదానము చేతువని౦న్నాము. అది నిజముకానట్లున్నది.
ఇంద్రా!తమ ఆశలన్ని నీం౦ద పెట్టుకొని, నీకు ౦త్రులయినస్తోతలకు ఏ౦ దొరికినది?

(ఆంధ్రవచనఋగ్వేద సంహితనాలుగవ అష్టకముఐదవ మండలమునమొదటి అధ్యాయమునరెండవఅనువాకముసమాప్తము)

ఓంనతా౦నన్తిమాయినోనధీరా వ్రతాదేవానాంప్రథమాధ్రువాణి
నరోదసీఅద్రుహా వేద్యాభిర్నపర్వతాని నమే తస్థివాంస:

## రెండవఅధ్యాయము

మూడవఅనువాకము ముప్పదిమూడవ సూక్తము

ఋషి- ప్రజాపతి పుత్రుడుసంవరణుడు, దేవత- ఇంద్రుడు, ఛందస్సు- త్రిష్టుప్.

1.నేను సంవరణ ఋషిని.అత్యంత దుర్బలుడను.ఇంద్రుడు మహాబలసంపన్నుడు.నేను ఇంద్రుని గూర్చిఅనేక స్తవములువచింతును. అందువలననా వంటి మనుష్యుడుబలవంతుడగును.సంగ్రామమునందుఅన్నలాభముకొఅకు స్తుతించగాఇంద్రుడు స్తోతలతోకూడ నన్ను అనుగ్రహించును.

2.ఇంద్రా! నీవు కోరికలుతీర్చువాడవు. నీకుప్రియములయినస్తోత్రములురచించిన వారిని నీదృష్టిలో ఉంచుకుందువు.ఆ స్తోత్రములతోరథమునకు కట్టినగుఱ్ఱముల కళ్ళెముపట్టుకొందువు. ఆ౦ధముగానీవు మా శత్రువులనుఓడించుము.

3.తేజో ౦శిష్టుడవగుఇంద్రా! నీ భక్తులకుభిన్నమైనవాడు,నీ వెంట ఉండనివాడు,బ్రహ్మకర్మహీనుడునీవాడుకాడు. కావుననీవు మా యజ్ఞమునకువచ్చునపుడునీవు స్వయముగా నడిపించురథమున ౦చ్చేయుము.

4.ఇంద్రా! నిన్ను కీర్తించుస్తుతులు అనేకములుఉన్న◌. నీవు భూ◌◌ద జలవృష్టినినిరోధించువారిని సంహరింతువు.నీవు అభీష్ట పూరకుడవు.సూర్యుని స్వస్థానమునవర్ష ప్రతిబంధకారకులగుదాసులతో యుద్ధముచేసినావు. వారి పేరు సహితము◌గలకుండ నష్టపరచినావు.

5.ఇంద్రా! మేము ఋత్విక్కులము.యజమానులము.మేమందరము నీవారలము.మేము యజ్ఞముచేయుదుము.నీ బలమునుపెంచుదుము. హోమముచేయుటకు నీ దగ్గరికిచేరుదుము. నీ బలముసర్వవ్యాపకము. నీ అనుగ్రహమునయుద్ధక్షేత్రమునభాగమున - ప్రశంసనీయ,◌శ్వసనీయ భృత్యులుమున్నగువారు మాకులభించవలెను.

6.ఇంద్రా! నీవు పూజనీయుడవు.సర్వవ్యాపి◌, అమరుడవు.నీవు నీ తేజమునజగములను నింపుము.శ్వేతవర్ణమగు ◌శేషధనమును మాకుప్రసాదించుము. మేము◌శేష ధనవంతుడగుదాత దానగుణమునుప్రశంసింతుము.

7.ఇంద్రా! నీవు శూరుడవు.మేము నిన్ను స్తుతింతుము.భజింతుము.మాకు రక్షణ కల్పించుము.పాలించుము. సంగ్రామమునవీవు నీ ఆచ్ఛాదకరూపమును ప్రదానముచేయుము. మాఅభిషుత సోమరసముసే◌ంచి సంతుష్టుడవగుము.

8.గిరిక్షిత గోత్రోత్పన్నుడు,పురుకుత్స పుత్రుడుత్రసదస్యుడు హిరణ్యవంతుడు.దాత. అతడు మాకుపది అశ్వములనుదానము చేసినాడు.అ◌ శుభ్ర వర్ణములు.అ◌ మమ్ము వహించవలెను.రథనియోజక కార్యములద్వారామేము శీఘ్రగమనులముకాగలము.

9.మరుతాశ్వుని పుత్రుడు◌దథుడు మాకు రక్తవర్ణములు,శ్రేష్ఠములగు అశ్వములనుదానము చేసినాడు.అ◌ మమ్ము వహించవలెను.అతడు మమ్ముపూజించి సహస్రపరి◌త ధనముఇచ్చినాడు. అతనివంటి ◌ది అలంకారములనుఇచ్చినాడు.

10.లక్ష్మణపుత్రుడుధ్వన్యుడు మాకుదీప్తిమంతములు,కర్మక్షమగల అశ్వములనుఇచ్చినాడు. అ◌ మమ్మువహించవలెను.గోవులు కొట్టములకుచేరినట్లు ధ్వన్యుడుఇచ్చిన మహాధనముసంవరణ ఋషి ఇంటికిచేరవలెను.

## ముప్పదినాలుగవ సూక్తము

ఋషి-ప్రజాపతిపుత్రుడు సంవరణుడు.దేవత- ఇంద్రుడు.ఛందస్సు - జగతి.చివరిది త్రిష్టుప్.

1.అజాత శత్రువగువాడు.శత్రువులనునాశనము చేయువాడు,అక్షీణ, స్వర్గప్రద, అపరి◌తహవ్యమునుఅందుకొనును. ఋత్విక్కులారా!అట్టి ఇంద్రుని కొఱకే◌రు పురోడాశాదుల పాకముచేయుడు. తగిన◌ధమున పూజింపుడు.

2.ఇంద్రుడు మృగనామకఅసురుని వధించదలచినపుడుసోమరసముతో అతనిజఠరమును నింపినాడు.ప్రముదితుడుఅయినాడు. అప్పుడు ఇంద్రుడుఅపరి◌త తేజోవంతమగుతన మహావజ్రమును ఎత్తినాడు.

3.ఇంద్రుని కొఱకు అహర్నిశలుసోమమును అభిష◌ంచుయజమానులుద్యుతిమంతులుఅగుదురు. యజ్ఞముచేయనివారయి ధర్మసంతతికోరువారిని సుందర అలంకారాదులుధరించువారిని ధనవంతులయ్యుకుత్సితులకు సాయముచేయువారిని ఇంద్రుడు◌డిచి పెట్టును.

4.తనను పూజించువాడుమాతాపితరులను(భ్రాతను వధించినవానిని సహితముఇం(ద్రుడు దూరముచేయడు. అతడుసమర్పించిన హవ్యమునుకాంక్షించును. శాసకుడు, ధనాధిపతియగుఇం(ద్రుడు పాపములకుసహితము ిచలితుడుకాడు.

5.ఇం(ద్రుడు శ(త్రువులనుసంహరించుటకుఅయుదుగురి, పదిగురి సహాయమునుఆశించడు. సోమాభిషవముచేయనివారితోను,బంధువులనుపోషించనివానితోనుఇం(ద్రుడు సాంగత్యముచేయడు. వారినిబాధించును.వధించును.ఇం(ద్రుడు యజ్ఞముచేయు యజమానులగోష్ఠములను గోవులతోనింపును.

6.ఇం(ద్రుడు యుద్ధమునశ(త్రువును క్షీణింపచేయును. రథపువేగమును పెంచును.అతడు సోమాభిషవముచేయని యజమానినిదూరము చేయును.సోమాభిషవముచేయువానిని వర్ధిల్లచేయును. ిశ్వరక్షకుడు,భయజనకస్వాిు ఇం(ద్రుడు యధేచ్ఛగాదాస కర్మము చేయువానినివర్ధిల్లచేయును.ిశ్వరక్షకుడు, భయజనకస్వాిు ఇం(ద్రుడు యధేచ్ఛగాదాస కర్మము చేయువారినితన వశమునఉంచుకొనును.

7.ఇం(ద్రుడు వర్తకులవలెధనమును తస్కరించును.మానవుల శోభనుపెంచునట్టి ధనమునుబహుిధఅన్య ధనములనుతెచ్చి యజ్ఞముచేయు యజమానులకుఇచ్చును. బలశాలియగుఇం(ద్రునకు కోపము కలిగించినవాడుమహాిపత్తులపాలగును.

8.ధనబలము,అంగబలముగల(ప్రత్యర్థులు సంపన్నములగుగోవుల కొఱకు పరస్పరముఘర్షణ పడుదురు. అప్పుడుఇం(ద్రుడు వారిలో యజ్ఞముచేయువారికి సాయపడును.మేఘములను కంపింపచేయగలఇం(ద్రుడు అట్టియజ్ఞకారి యజమానికిగోసమూహములు(ప్రదానము చేయును.

9.గుణ ిశిష్టుడవగు ఇం(ద్రా!అపరిిుత ధనదాతఅగ్నివేశపు(త్రుడు(ప్రసిద్ధ శ(త్రినామకరాజర్షిని స్తుతింతుము.అతడు ఉపమానభూతుడు(ప్రఖ్యాతుడు. జలరాశిఅతనిని సంపూర్ణముగ సంతుష్టునిచేయవలెను.అతని ధనముబలవంతము,దీప్తివంతముకావలెను.

## ముప్పదిఅయిదవ సూక్తము

ఋషి- అంగిరస గో(త్రజుడు(ప్రభూవసుడు,దేవత-ఇం(ద్రుడు,ఛందస్సు - అనుష్టుప్,చివరిది పంక్తి.

1.ఇం(ద్రా! నీ అతిశయ (ప్రజ్ఞమమ్ము రక్షించవలెను.నీ కార్యములు సమస్తజనులకు కళ్యాణకారకములగును.పరిశుద్ధములగును.సం(గ్రామమున ఇతరులుఎదిరించరానిి అగును.

2.ఇం(ద్రా! నీవు చేయునట్టిచతుర్వర్ణములరక్షాకార్యమును (త్రిలోకములరక్షాకార్యమును, పంచజనులరక్షాకార్యమును అట్టిసమస్త రక్షాకార్యములునీవు మా కొఱకు భ(ద్రపరచుము.

3.ఇం(ద్రా! నీవు అభిమతఫలసాధకుడవు.వృష్టికర్తవు. శీ(ఘ్రశ(త్రు సంహారకుడవు.నీ రక్షణ కార్యము వరణీయము.మేము దానిని ఆహ్వానింతుము.నీవు సర్వవ్యాపి మరుత్తులతోకలసి మాకు ఫల(ప్రదానముచేయుము.

4.ఇం(ద్రా! నీవు అభీష్టవరదుడవు. యజమానులకుధనము ఇచ్చుటకేనీవు జన్మించినావు.నీ బలము ఫల(ప్రదముఅగును. నీ మనసు దృఢమయినది- ిరోధులను అణచివేయునదగును.నీ పౌరుషము సంఘిినాశకము."స(త్రాహ ిం(ద్రపౌంస్యమ్"
(స(త్రాహంసంఘహంతృ అనిశాయణుడు ఇం(ద్రునికోపము సంఘ ినాశకారి అని అర్థముకావచ్చును)

5.ఇంద్రా! నీవు వజ్రధారి◌.నీ రథము సర్వత్రఅప్రతిహతముగసంచరించును. నీవునూరు యజ్ఞములుచేసినవాడవు.శతక్రతువవు.నీవు బలములకుఅధిపతి◌. నీ ◌షయమునశత్రుత్వము చూపినవాడిపైనీవు దండెత్తెదవు.

6.ఇంద్రా! నీవు శత్రుహంతవు.ఉద్యతాయుధుడవు.బృహత్ ప్రజలలోపురాతనుడవు. యజ్ఞముచేయువారు యుద్ధములందునిన్ను ఆహ్వానింతురు.

7.మా రథము సంగ్రామమునసకల ◌ధ ధనములనుకాంక్షించును. అనుచరులవెంట సాగును. దుర్నివార్యము,రణ సంకులము అగును.ఇంద్రా! అట్టి మారథమును నీవురక్షింపుము.

8.ఇంద్రా! నీవు మా వద్దకుఆత్మీయుడవయిరమ్ము. నీ ఉత్కృష్టబుద్ధితో మా రథమునుకాపాడుము. నీవు నిరతిశయబలశాలి◌. దీప్తిమంతుడవు.నీ అనుగ్రహమునమేము వరణీయధనమును, యశస్సునుపొందవలెను. ఇంద్రా!మేము నిన్ను స్తుతించుచున్నాము.

## ముప్పదిఆరవ సూక్తము

ఋషి-అంగిరసగోత్రజుడు ప్రభూవసుడు,దేవత-ఇంద్రుడు,ఛందస్సు-త్రిష్టుప్.మూడవది జగతి.

1.ఇంద్రుడు మా యజ్ఞమునకు◌చ్చేయవలెను.ధనమునకు ప్రతీకఅయిన దేవత ఎటువంటివాడు?ఇంద్రుడు స్వభావత:దాత. ధనుస్సు వెంటసాగుధనుర్ధారివలెసాహసపూర్ణ గమనముగల,అత్యంత సంతుష్టుడయినఇంద్రుడు అభిషుతసోమపానము చేయవలెను.

2.ఇంద్రుడు అశ్వద్వయసంపన్నుడు. శూరుడు.మేము సమర్పించుసోమరసము పర్వత శిఖరమువంటిఅతని హనుప్రదేశమును ఆరోహించవలెను.గడ్డి వలన అశ్వములుతృప్తి చెందును.అట్లే మేము స్తుతులద్వారా నిన్ను ప్రీతునిచేతుము.
ఇంద్రా!నీవు బహుస్తుతుడవు.

3.ఇంద్రా! నీవు బహుస్తుతుడవు.వజ్రవంతుడవు.భూ◌◌ంద తిరుగుచక్రమువలెమా హృదయముదారిద్ర్య భయమునగడగడలాడుచున్నది.సర్వదా వర్ధమానుడవగుఇంద్రా!
పురావసుఋషి బహుళస్తుతులతో నిన్నుస్తుతించుచున్నాడు.నీవు రథారూఢుడవగుము.

4.ఇంద్రా! ◌శేష ఫలమునుఅనుభ◌ంచు స్తోతలుఅభిషవశిలవలెనిన్ను స్తుతింతురు.ధనవంతుడవు,హర్యశ్వవంతుఇంద్రా! నీవు కుడి, ఎడమ రెండు చేతులతోధనదానముచేతువు. నీవుమమ్ము ◌ఫల మనోరథులనుచేయకుము.

5.ఇంద్రా! నీవు అభీష్టవరదుడవు. అభీష్టవర్షులగు ద్యావాపృథ్వులునిన్ను సంవర్ధితునిచేయుదురు. నీవువర్షకారి◌. అశ్వములు నిన్నుయజ్ఞస్థలమునకుచేర్చును. శోభనహనువులుగలవజ్రధారివైనఇంద్రా! నీ రథము కళ్యాణవహముఅగును. యుద్ధముననీవు మమ్ము రక్షింపుము.

6.ఇంద్ర సాహాయకమరుత్తులారా! అన్నవంతుడగుశృతరథ మహారాజుమాకు లోహిత వర్ణములగు రెండు అశ్వములనుమూడువందలగోరూప ధనమునుదానము చేసినాడు.నిత్య యవ్వనుడగుఆ శృతరథ రాజునుసకల ప్రజ ప్రసన్న మైప్రణ◌ల్లును.

## ముప్పదిఏడవ సూక్తము

ఋషి-అత్రి,దేవత-ఇంద్రుడు,ఛందస్సు-త్రిష్టుప్.

1.యథాంధి ఆహుతఅగ్నిలో హవ్యప్రదానము చేయుటవలన అగ్ని ప్రదీప్తముఅగును. సూర్యరశ్మి సహితముగాఆహూయ మానుడుఅగును. "ఇంద్రుని కొఱకుహోమము చేయుము"అన్న యజమానికొఱకు ఉష అహింసితముఅగును.

2.అగ్నిని ప్రదీప్తముచేయునట్టికుశలను ంస్తృతపరచునట్టియజమాని అగ్నినిభజించును.సోమరసమును అభిషంంచువారు స్తుతింతురు. ఏ అధ్వర్యునిపాషాణమున సుమధురశబ్దమగునో ఆ అధ్వర్యుడుహవ్యముతీసికొని నదిలోనికిచేరవలెను.

3.పత్ని పతిని వాంఛించియజ్ఞమున అతనినిఅనుసరించును. ఇంద్రుడుఅదేరీతి తననుఅనుసరించు మహిషినిఅనుగంంచును. ఇంద్రునిరథము ంశేష ధనమువహించి మావద్దకు రావలెను.అది అధిక శబ్దముచేయును. అదినలువైపుల వేలధము ంసరవలెను.

4.ఎవని యజ్ఞమునదుగ్ధంశ్రిత మదజనకసోమరసమును ఇంద్రుడుపానము చేయునోఆ యజ్ఞము చేయురాజు ఎన్నటికివ్యధితుడుకాడు. అతడు అనుచరులవెంట సర్వత్ర సంచరించును.శత్రుసంహారముచేయును. ప్రజలనురక్షించును. సుఖసంతోషములుకలిగి ఇంద్రుని సేంంచును.

5.ఇంద్రునకు అభిషుతసోమము సమర్పించువాడుబంధువులను,బాంధవులనుపోషించును. ప్రాప్తధనమునురక్షించును. అప్రాప్త ధనమునుసాధించును. వర్తమానఅహోరాత్రులనుగెలుచును. అతడుసూర్యుడు, అగ్ని ఇద్దరికిప్రీతిపాత్రుడు అగును.

## ముప్పదిఎనింంబదవ సూక్తము

ఋషి-అత్రి,దేవత - ఇంద్రుడు,ఛందస్సు-అనుష్టుప్.

1.ఇంద్రా! నీవు సర్వదర్శిం.శోభన ధనవంతుడవు.నీవు మహా కార్యములుచేసినావు. నీవుంశేష ధనమునుమహాదానముచేతువు. నీవుమాకు మహాధనమునుప్రసాదించుము.

2.ఇంద్రా! నీవు మహాబలశాలిం.హిరణ్య వర్ణుడవు.నీవు సుప్రసిద్ధము.ప్రచురమగు అన్నమునకుఅధిపతిం. అయిననుఆ ంషయము అత్యంతదుర్లభరూపమునసర్వత్ర కీర్తితముఅగును.

3.వజ్రధర ఇంద్రా!పూజనీయులు, ంఖ్యాతకర్మవంతులగు మరుత్తులునీకు బలస్వరూపులు.ంరిద్దరు ఇంద్ర మరుత్తులుభూంంద స్వేచ్ఛాంహరులగుచుశాసించెదరు.

4.వృత్రహంతఇంద్రా! మేము నిన్నుఉపాసింతుము. నీవు మమ్ముధనాఢ్యులనుచేయకోరినవాడవు.మాకు ఎవరేని క్షమతాశీలునిధనము తెచ్చిఇమ్ము.

5.శతక్రతువగు ఇంద్రా!నీ రాకతో మేము త్వరగాసమృద్ధులముకావలెను. నీ సుఖమునమమ్ము భాగస్వాములనుచేయుము. నీ వలనమేము సురక్షితులముకావలెను.

## ముప్పదితొంమ్మదవ సూక్తము

ఋషి-అత్రి,దేవత-ఇంద్రుడు,ఛందస్సు- అనుష్టుప్,చివరిది పంక్తి.

1.ఇంద్రా! నీవు వజ్రధరుడవు.ధనవంతుడవు.నీ రూపము అత్యంతంచిత్రము. ఇచ్చుటకునీవద్ద ఉన్న బహుమూల్యధనమును మాకురెండు చేతులతోప్రసాదించుము.

2.ఇంద్రా! నీవు అతి శ్రేష్ఠముఅనుకున్న ధనమునుమాకు ప్రదానము చేయుము.మేము ఆ ధనమునకుదానపాత్రులముకావలెను.

3.ఇంద్రా! నీ మనసు దానముచేయుటకు ఆతురతగలది గొప్పది. నీవుమాకు సాదరముగా సారవంతఅన్నము ప్రదానముచేయదలతువు.

4.ఇంద్రుడు హంర్లక్షణధనయుక్తుడు.అతడు మాకు అత్యంతపూజనీయుడు. అతడుమానసాధిపతి.స్తోతలు ప్రాచీనస్తోత్రములతోఇంద్రుని స్తుతించిసేంంతురు.

5.ఇంద్రుని కొఱకు మాత్రమేఈ కావ్యము, వాక్యము,ఉక్థము ఉచ్చరితములయినం.ఇంద్రుడు స్తోత్రవాహకుడు.అత్రిపుత్రుడు ఇంద్రునిముందేస్తోత్రములనుఉచ్చైస్వరమునఉచ్చరించును. ఉద్దీప్తముచేయును.

## నలుబదవసూక్తము

ఋషి-ఆత్రేయుడు,దేవత- ఇంద్రుడుఛందస్సు 1-3 ఉష్ణిక్, 5, 9అనుష్టుప్ ుగిలినంత్రిష్టుప్.

1.ఇంద్రా! నీవు ఫలప్రదాతవు.శత్రుహంతవు.నీవు మా యజ్ఞమునకుంచ్చేయుము. వచ్చిసోమస్వాుువగు నీవుశిలాభిషుత సోమమునుపానము చేయుము.ఫలవర్షులగు మరుత్తులసహితముగాసోమపానము చేయుము.

2.అభిషవ సాధనపాషాణము వర్షణకారిఅగును. సోమపానజనితహర్షము వర్షణకారిఅగును. అభిషుతసోమము వర్షణకారిఅగును. ఫలవర్షక, శత్రుహంతఇంద్రా! నీవు ఫలవర్షకులగుమరుత్తులతో సోమపానముచేయుము.

3.ఇంద్రా! నీవు వజ్రధరుడవు.ఫలవర్షిం. శత్రుహంతవు.సోమరస సేవన కర్తవు.అభీష్ట వరదుడవు.మమ్మ రక్షించుమనినిన్ను ఆహ్వానించుచున్నాము.ఫలవర్షులగు మరుత్తులతోకలిసి సోమపానముచేయుము.

4.ఇంద్రా! నీవు ఋజీషిం.వజ్రధరుడవు.అభీష్టవర్షిం. శత్రుసంహారకర్తవు. బలవంతుడవు.సర్వులకు ఈశ్వరుడవు. వృత్రహంతవు.సోమపాయిం. అట్టి ఇంద్రుడుగుఱ్ఱములనురథమున పూన్చిమా వద్దకు రావలెను.మధ్యందినసవనమున సోమముసేంంచవలెను.హృష్టుడవుకావలెను. (రెండుసవనములందుఅభిషుతమయి తృతీయసవనమున మరలఅభిషంంచబడినసోమము ఋజీషము)

5.సూర్యుడా! స్వర్భాను నామకఅసురుడు నిన్ను అంధకారమునఆచ్ఛాదించినపుడుఅక్కడి జనులుతమను మరిచినమూఢులవలెసకల భువనములుకళ్ళుప్పచెప్పిచూచినం.

6.ఇంద్రా! సూర్యుని అధోదేశమునినిలిచిన స్వర్భానునిద్యుతిమంతమగుమాయను దూరమునుండియే కొట్టివేసినావు.అప్పుడు వ్రతంధాత,అంధకార సమాచ్ఛన్నసూర్యుని అత్రి నాలుగుఋక్కులతో మంత్రములతోమరల ప్రకాశితునిచేసినాడు.

7.సూర్యుడు అనుచున్నాడు.అత్రీ! నేను ఈ దశలోఉన్నాను. నేను నీవాడను.అన్నమునకుగానుద్రోహము చేయుఅసురుడు భయంకరమగుఅంధకారమున నన్నుుంంగునేమో! అందువలననీవు, వరుణుడుమమ్మ రక్షించవలెను.నీవు నాకు ుత్రుడవు.సత్యపాలకుడవు.

8.అప్పుడు ఋత్విక్ అత్రిసూర్యునకు ఉపదేశముప్రసాదించినాడు. ప్రస్తరఖండఘర్షణమున ఇంద్రునికొఱకు సోమాభిషవముచేసినాడు. స్తోత్రములతోదేంని పూజించినాడు.మంత్ర ప్రభావమునఅంతరిక్షమున సూర్యచక్షువునుస్థాపించినాడు. అప్పుడుఅత్రి స్వర్భానుని సమస్తమాయలను దూరమునుండియే నిష్ఫలముచేసినాడు.

9.అసుర స్వర్భానుడు అంధకారమునసూర్యుని ఆవరించినాడు.అత్రి పుత్రుడు అట్టిసూర్యుని ముక్తుని చేసినాడు.అది చేయు సమర్థుడుమరొకడు లేడు.

## నలుబదిఒకటవ సూక్తము

ఋషి-భౌమఅత్రి, దేవత- శ్వేదేవతలు,ఛందస్సు-7,16 జగతి,20 రాట్ గిలిన త్రిష్టుప్.

1.త్రావరుణులారా! ఉభయుల యజ్ఞముచేయుటకు ఏ యజమానిసమర్థుడగును? రుపృథిం అంతరిక్షపు ఏ స్థానముననిలిచి మమ్ము రక్షింతురు? హవ్యదాతయజమానికి పశువులు,ధనము ఎట్లుప్రసాదింతురు?

2.త్రా! వరుణా! ఆర్యమా!ఆయూ! ఇంద్రా! ఋభుక్షా!మరుద్గణములారా!అందరు మా యొక్క శుభంకరము, పాపవర్జితమగుస్తోత్రమునుఆలకింపుడు. అందరురుద్రసహితముగాప్రీతులగుడు. మాపూజలను స్వీకరించుడు.

3.అశ్వినులారా! రిద్దరుదమనకారులు. రథమునువాయువేగవంతముచేయుటకు మేముమ్ము ఆహ్వానించుచున్నాము.
ఋత్విక్కులారా!ద్యుతిమంతుడు,ప్రాణాపహారకుడగురుద్రుని స్తోత్రములు,హవ్యములుస్వీకరించుడు.

4.మేధావులు ఆహ్వానించువారు; యజ్ఞములను సేంచువారు,శత్రునాశకులు, స్వర్గీయులగు వాయువు, అగ్ని, పూషలుక్షితిజాది మూడు స్థానముల నిలిచి సూర్యుని వెంట సమానరూపులయిప్రియము కలిగింతురు. ఈ సకల శ్వరక్షక దేవతలుయజ్ఞస్థలమునకు వేగవంతమగు అశ్వము యుద్ధమునకుపరుగులిడినట్లు త్వరగా చ్చేయవలెను.

5. మరుత్తులారా!రు అశ్వసహిత ధనమును సముపార్జించుడు. స్తోతలుగోవులు, అశ్వములు మున్నగు ధనలాభమునకును,ఉన్న ధనమును రక్షించుటకును మ్ము స్తుతింతురు.ఉశిజ పుత్రుడు కక్షీవంతుని హోత అత్రి గమనముగలఅశ్వములతో సుఖించవలెను. వేగవంతములగు ఆ అశ్వములువే అగును.

6. మాఋత్విక్కులారా! ద్యుతిమంతుడు, కోరికలు తీర్చువాడు, ప్రునివలెపూజ్యుడు, స్తుతి యోగ్యుడగు వాయువును యజ్ఞమునకుచేరుటకుగాను స్తుతులద్వారా రథారూఢుని చేయండి. గమనవతులు,యజ్ఞగ్రహణ కారిణులు, రూపవతులు, ప్రశంసనీయులగుదేవపత్నులు మా యజ్ఞమునకు చ్చేయవలెను.

7. అహోరాత్రిదేవతలారా! రు మహామహులు. వందనీయులగుస్వర్గస్థ దేవతల వెంట మేము కు సుఖప్రదములగుజ్ఞాపక మంత్రములతో హవ్యములు సమర్పింతుము.
దేవతలారా!రు సకల కర్మజాతములను ఎరుగుడు. యజమానియజ్ఞమునకు అభిముఖముగా చ్చేయుడు.

8. రందఱుఅనేకుల పోషకులు. యజ్ఞమునకు నేతలు. స్తోత్రాదులద్వారాను,హం సమర్పించియు మా ధనలాభము కొఱకు మ్ముస్తుతింతుము. వాస్తువతి త్వష్టను మేము స్తుతింతుము.ధనములు ప్రసాదించునది, అన్యదేవతల వెంట సాగునదిఅనిందితవాణిని మేము స్తుతింతుము. వనస్పతులనుఓషధులను స్తుతింతుము.

9. రులవలెలోకములను స్థాపించిన మేఘము స్తృత దాన షయమునమాకు అనుకూలుడు కావలెను. మేఘుడు స్తుతియోగ్యుడు.ఆప్తుడు. యజనీయుడు. మానవ హితకారి. అతడు మాస్తుతులకు ప్రసన్నుడు కావలెను. మమ్ము సమృద్ధులనుచేయవలెను.

10.మేఘము వర్షకారి. అంతరిక్ష స్థితుడు. అతని గర్భస్థజలమును రక్షింపుమని వైద్యుతాగ్నిని పాపవర్జిత శోభనస్తోత్రములతో స్తుతింతుము. అగ్ని మూడు స్థానములందుండిత్రిధుడయి ఉన్నాడు. నేను

ప్రయాణించునపుడు సుఖకరకిరణములు కలవాడగును. కోపింపడు. కాని ప్రదీప్తజ్వాలలు ధరించిన అగ్ని అడవులను ధ్వంసము చేయును.

11.మేము అత్రిగోత్రజులము. మహారుద్రపుత్రులు మరుత్తులనుఎట్లు స్తుతించవలెను? సర్వ◌ుడుడగు భగుని ధనలాభమునకుగాను ఎట్లు స్తుతించవలెను? జలదేవత, ఓషధులు, ద్యుదేవత,వనములు, వృక్షములు కేశములుగాగల పర్వతముమమ్ము రక్షించవలెను.

12.జలములకు - అన్నములకు అధిపతి. ఆకాశ సంచారి వాయువుమా స్తుతులు ఆలకించవలెను. నగరమువలె ఉజ్వలము.పర్వతపు నలుదిశల పడు జలధార మా వాణిని
◌నవలెను.

13.మహామరుత్తులారా! ◌రు వెంటనే స్తుతులను తెలియండి.మేము ◌మ్ము స్తుతించువారము. హవ్యములు పట్టుకొనినిన్ను స్తుతింతుము. మరుద్గణములు అనుకూల భావనమున◌చ్చేయవలెను. క్షోభ కలిగించు మానవవైరులనుఅస్త్రములు ప్రయోగించి పరిమార్చి మావద్దకు ◌చ్చేయవలెను.

14.దేవసంబంధి, భూసంబంధి జనులకు జల లాభమునకుగానుసుందర యజ్ఞవంతులగు మరుత్తులను స్తుతింతుము.మా స్తుతులు వర్ధిల్లవలెను. ప్రీతిదాయకము స్వర్గముసమృద్ధి సంపన్నము కావలెను. మరుత్తుల ద్వారా పరిపుష్టములగునదులు జలపూరములు కావలెను.

15.మేము సదా స్తుతింతుము. ఉపద్రవములు నివారించి మమ్ముఁరక్షించుటకు సమర్థురాలు, సర్వనిర్మాత్రి, పూజ్యురాలగుభూ◌ మా స్తుతులను స్వీకరించవలెను. ప్రశస్తవచనులగుమేధావులగు స్తోతల ◌షయము భూ◌ ప్రసన్నురాలుకావలెను. అనుకూల హస్త అయి మాకు శుభములు కలిగించవలెను.

16.దానశీల మరుత్తులను మేము ఏరీతి సముచితముగా స్తుతింతుము?వర్తమాన స్తుతుల ద్వారా ఎట్లు మరుత్తులను ఉపాసింతుము?వర్తమాన స్తుతుల ద్వారా మరుత్తులను ప్రశంసించుటఎట్లు సాధ్యము? అహిబుధ్న్యదేవుడు మాకు అనిష్టుడు కారాదు. శత్రువులను నష్టపరచవలెను.

17.దేవతలారా! మానవ యజమానులు సంతానము కొఱకుగాను,పశువుల కొఱకును శీఘ్రముగా ◌మ్ము ఉపాసింతురు.ఈ యజ్ఞమందు నిఋతి దేవత కళ్యాణకర అన్నమున మాశరీరములను పోషించవలెను. వార్ధక్యమును దూరముచేయవలెను.

18.వసువులారా! ◌ సుమతి ధేనువు యొక్క బలకరము,హృదయ పోషకమగు అన్నము మాకు లభించవలెను.ఆదానశీల, సుఖదాయిని దే◌ మాకు సుఖములు ప్రసాదించుటకుత్వరత్వరగా ◌చ్చేయవలెను.

19.గోసంఘ నిర్మాతలు ఇడ - ఊర్వశీ నదుల సహితముగామా ◌షయమున అనుకూలవతులు కావలెను. నిరతిశయదీప్తిశాలిని ఊర్వశి మా యజ్ఞాది కార్యములను ప్రశంసించవలెను.యజమానులను ప్రకాశవంతము చేయుటకు ◌చ్చేయవలెను.

20.అర్జువ్యరాజు యొక్క దేవసంఘము మమ్ము అనుగ్రహించవలెను.

## నలుబదిరెండవ సూక్తము

ఋషి-భౌమఆత్రేయుడు, దేవత - ◌శ్వేదేవతలు, ఛందస్సు-త్రిష్టుప్.

1. హవ్యసహితులమయిన మేము నిరతిశయ, సుఖదాయక స్తుతులతోవరుణ, ◌త్ర, భగ ఆదిత్యులవద్దకు చేరుదుము. వాయువు పంచప్రాణ సాధకుడుఅంతరిక్షమున సంచరించువాడు. అప్రతిహతగమనుడు.ప్రాణదాత. సుఖ సముపార్జకుడు. అట్టి వాయువు మా స్తుతులను◌నవలెను.

2. మాస్తోత్రములు హృదయంగమములు, సుఖకరములు, తల్లిబిడ్డను దగ్గరకు తీసుకున్నట్లు అదితి మా స్తోత్రములనుస్వీకరించవలెను. అహోరాత్రులకు, ◌త్రావరుణులకుమేము మనోహరములు, ఆనందదాయకములు, దేవగ్రాహ్యములగుస్తోత్రములను సమర్పింతుము.

3. ఋత్విక్కులారా!◌రు అతిశ్య క్రాంతదర్శి, పురావర్తి అగ్ని- స◌తను ప్రముదితునిచేయండి. మధుర సోమరసము మఱియు ఘృతమునఅతనిని అభిషిక్తుని చేయండి. స◌త మాకు పరిశుద్ధము,హితకరము, ఆహ్లాదకరమగు హిరణ్యమును ప్రదానముచేయవలెను.

4. ఇంద్రా!నీవు ప్రసన్న మనమున మాకు గోవులను దానము చేయుము.నీవు మాకు మేధా◌ పుత్రులను, దేవతలకు హితకరమగుఅన్నమును, యజ్ఞదేవతల అనుగ్రహమును ప్రసాదింతువు.

5. భగదేవుడు;ధనస్వా◌ స◌త; వృత్రహంత ఇంద్రుడు; ధన ◌జేతఋభుక్షుడు, వాజ, పురంధి ఆది సమస్త అమరులు శీఘ్రముగామా యజ్ఞమునకు ◌చ్చేయవలెను. మమ్ము రక్షించవలెను.

6. మేముయజమానులము. మరుద్వంతుడగు ఇంద్రుని కార్యములనువర్ణింతుము. ఇంద్రుడు యుద్ధమున ఎన్నడును వెన్నుచూపడు.అతడు ◌జయుడు. జరారహితుడు.
ఇంద్రా!నీ పరాక్రమము ఏ పురాతన పురుషునకుగాని అటు తరువాతవచ్చినవారికి గాని లభించలేదు. ఏ న◌నుడు సహితమునీ పరాక్రమమును అందుకొనలేదు.

7. అంతరాత్మా!నీవు అతిశయ శ్రేష్టుడు. రమణీయ ధనదాత బృహస్పతినిస్తుతించుము. అతడు హ◌ర్లక్షణ ధన◌భాజకుడు.బృహస్పతి స్తోత్రకర్తలగు యజమానులకు మహాసుఖములుప్రసాదించును. ఆహ్వానించు యజమాని వద్దకు అతడు ◌శేషధనము చేకొని ◌చ్చేయును.

8. బృహస్పతీ!నీవు రక్షించు మానవుడు అహింసితుడు, ధనవంతుడు,సుందర పుత్రయుక్తుడు అగును. నీవు అనుగ్రహించినధనవంతుడు అశ్వములు, గోవులు, వస్త్రములు దానముచేయును. అతనికి ధనలాభము కలుగవలెను.

9. బృహస్పతీ!స్తుతిప్రతిపాదకులమగు మాకు దానము ఇవ్వక తానే సర్వముఅనుభ◌చువానిని, వ్రతములు ఆచరించనివానిని మంత్ర◌ద్వేషిని నష్టపరచుము. అతని ధనమును నష్టపరచుము.అట్టివాడు ఒకవేళ సంతతి సమృద్ధుడయి, వర్ధమానుడుఅగుచున్నను వానిని అంధకారమున త్రోయుము.

10.మరుత్తులారా! దేవయజ్ఞమునకు రాక్షసులను పిలుచుయజమానిని అన్నము, అశ్వము, కృష్యాదుల ద్వారా ఉత్పన్నములగుభోగములకు బాధలు కలిగించువానిని నిన్ను స్తుతించువారినినిందించువానిని ◌రు చక్రహీన రథమున అంధకారమునత్రోయుడు.

11.రుద్రుని ధనుర్బాణములు సుందరములు. శత్రునాశకములు.ఆత్మా! అట్టి రుద్రుని స్తుతించుము. రుద్రుడు సమస్త ఓషధులకుఈశ్వరుడు. ఆత్మా! నీవు అట్టి రుద్రుని యజింపుము. రుద్రుడుద్యుతిమంతుడు. బలవంతుడు. ప్రాణదాత. ఆత్మా! లోక కళ్యాణమునకుగానుఅట్టి రుద్రునకు పరిచర్యలు చేయుము.

12.దాంత మనస్కులు చమూసము, అశ్వము, రథము, గోవులుమున్నగువాని నిర్మాణమున కుశల హస్తులగు ఋభువులు;వర్షణకారి ఇంద్రుని పత్ని; గంగాది నదులు; ఋభుకృతసరస్వతి; దీప్తిమతి రాకా మున్నగునవి దీప్తములయిఉన్నవి. అవి మాకు ధనమును ప్రసాదించవలెను.

13.ఇంద్రుడు మహామహుడు. శుభముల రక్షకుడు. అతనికిఅత్యంత స్తుత్యములు. సద్యోజాతములగు స్తుతులను సమర్పింతుము.ఇంద్రుడు వృష్టికారకుడు. అతడు కన్యారూపమగు పృథ్వీహితమునకుగాను నదులకు రూప కల్పన చేసినాడు.మాకు జలములను అనుగ్రహించినాడు.

14.స్తోతలారా! మీ శుభంకర స్తుతులు గర్జనశీలుడు, శబ్దకారి,ఉదకస్వామి పర్జన్యుని చేరవలెను. అతడు మేఘములనుధరించును. జలవృష్టి కలిగించును. ద్యావాపృథ్వులనువైద్యుతా లోకమునుండి పరికించి పయనము సాగించును.

15.మేము సముపార్జించిన స్తోత్రము రుద్రుని యువ పుత్రులుమరుత్తుల అభిముఖమున ఉపస్థితము కావలెను. మనసా!ధనేచ్ఛ మమ్ము నిరంతరము ఉత్తేజితులను చేయును.విధ వర్ణ అశ్వములు ఆరోహించి యజ్ఞమునకు వచ్చువారినిస్తుతింపుము. "కామో రాయేహవతే"

16.ధనము కొఱకుగాను మాద్వారా విహితములయిన స్తుతులుపృథ్వి, స్వర్గము, వృక్షములు. ఓషధులకు చేరవలెను.నా కొఱకుగాను అందఱు సుందర దేవతలు ఆహూతులు కావలెను.భూమాత మాకు చెడు తలంపులు కలుగనీయరాదు.

17.దేవతలారా! మాకు నిరంతరము నిర్విఘ్నముగా మహాసుఖభోగములు కలుగవలెను.

18.అశ్వినుల రక్ష ఆనందదాయకము. సుఖసంపన్నము. అంతకుముందుమరెవరికి లభించని అశ్వినుల రక్ష మాకు లభించవలెను.అమరులగు అశ్వినులారా! మీరు మాకు ఐశ్వర్యమును వీరపుత్రులను,సౌభాగ్యమును ప్రసాదించుడు.

## నలుబదిమూడవ సూక్తము

ఋషి-అత్రి,దేవత-విశ్వేదేవతలు, ఛందస్సు-త్రిష్టుప్.

1. వేగవతులగునదులు బాధలు కలిగించక మధుర రసముతో మావద్దకువచ్చేయవలెను. విశేష ప్రీతి కలిగించు స్తోతలు మహాధనలాభమునకుగానుఆనందదాయకములగు సప్తమహానదులను ఆహ్వానించవలెను. (శాయణుడుఏడు నదుల పేర్లు ఇవ్వలేదు. "ఇమే గంగా ఇతి మంత్రోక్తః"అన్నాడు. ఇటిని గంగ అనియే మంత్రము చెప్పుచున్నది.మాక్సుముల్లర్ పంజాబులో ప్రవహించు అయిదు నదులతోపాటుసింధు, సరస్వతి కలిసి సప్తనదులని చెప్పినాడు. సప్తసింధూ దేశము పేరు కూడ కావచ్చును.)

2. మేముశుభంకర స్తవము హవ్యము ద్వారా- అన్న లాభమునకుగాను- అహింసారూపములగుద్యావాపృథ్వులను ప్రసన్నము చేయవలెనని కోరుచున్నాము.ప్రియవదన, శోభన హస్త, యశోయుక్త, మాతా పితృస్వరూపద్యావాపృథ్వులు యుద్ధమున మమ్ము రక్షింపువలెను.

3. అధ్వర్యులారా!మధుర ఆజ్యాది హవ్యమును సమర్పించండి. రమణీయము,దీప్తమగు సోమమును సర్వప్రథమముగా వాయువుకుసమర్పించండి. వాయువా! నీవు హోతవలె ఈ సోమమునుఇతర దేవతలకన్న ముందు స్వీకరించుము. ఈ మధురసోమరసమును నీ ఆనందమునకుగాను సమర్పించుచున్నాము.

4. ఋత్విక్కులసోమపేషకములగు పది చేతి(వేళ్ళు సోమరస నిష్యందపటుత్వముగల రెండు బాహువులు శిలలను గ్రహించును.కుశలాంగుళియుక్తులగు ఋత్విక్కులు ఆనందితులయి సోమలతనుండి శైలజ రసమును పితుకుదురు. సోమము నుండిశుభ్ర రసము స్రంచును.

5. ఇంద్రా!నిన్ను సేంచుటకు - వృత్రాదివద కార్యములకు - నీ బలమునకు- నీకు మహాహర్షము కలిగించుటకు నీకు సోమరసముఅర్పించబడును. అందుకే నిన్ను మేము ఆహ్వానింతుము.నీవు ప్రియములు, సుశిక్షితములు, నమ్రములగుఅశ్వద్వయమును రథయుక్తము చేసి మా వద్దకు చ్చేయుము.

6. అగ్నీ!నీవు మాకు ప్రియంకరుడవు. మధుర సోమరస పానమునప్రహృష్టమగుటకుగాను దేవతల మార్గమున గ్నాందేనిమావద్దకు కొనిరమ్ము. బలశాలినియగు ఆదే సర్వత్ర సంచరించవలెను.యజ్ఞమును తెలిసికొనవలెను. స్తోత్రముల సహితముగాఆ దేకి హంసమర్పితము కావలెను.
(''గ్నాఃగ్నాం దేం సర్వైర్గంతవ్యా మేతే న్నామకాం దేవతాం''అని శాయణుడు. అందరు చేరుకోగల దేవత గాన ఆ పేరువచ్చినదని.
''గచ్ఛన్తిజ్ఞానం యయా'' అని దయానందుడుజ్ఞానము కలిగించు దేవత అని. గ్నామ్ స్త్రీకి సమానార్థము)

7. మేధావులైనఅధ్వర్యులు తండ్రి వడిలో తనయునివలె అగ్నింద హవ్యపాత్రనుస్థాపించినారు. అది చూడగా స్థూలకాయముగల పశువునువారందరు అగ్నిద్వారా పితుకుచున్నట్లున్నది.

8. మాఈ స్తోత్రము పూజనీయము. మహంతము. సుఖదాయకము.అశ్వినులను ఈ స్థానమునకు ఆహ్వానించుటకు మా స్తోత్రముదూతవలె పనిచేయవలెను. సుఖదాయకులగు అశ్వినులారా!రు ఒకే రథమున ఎక్కి మేము సమర్పించు సోమమువద్దకు- బరువు మోయు మేకువలె చ్చేయండి. మేకులేనినాభితో రథము నడువనట్లు రు లేకుండ సోమయాగనిర్వహణ జరగదు.

9.మేము బలవంతుడు, వేగవంతుడగు పూష మఱియువాయుదేవులను స్తుతింతుము. ఆ ఉభయులు ధనము,అన్నమునకుగాను జనుల బుద్ధులను ప్రేరేపించవలెను.వారు ధనదానము చేయవలెను.

10.అగ్నీ! నీవు సమస్త సృష్టిని ఎరిగినవాడవు. మేమునిన్ను ఆహ్వానించుచున్నాము. నీవు ఇంద్రవరుణాది నామములుధరించి భిన్నాకృతులుగల నిఖిల మరుత్తులను యజ్ఞమునకుతీసికొని రమ్ము.
మరుత్తులారా!రు సకల రక్షణలతో యజమాని యజ్ఞమునకు ఫలవతిస్తుతికి - పూజకు చ్చేయండి.

11.సరస్వతి మాచే పూజలు అందుకొన తగినది. ఆమె ద్యుతిమంతమగుద్యులోకము నుండియు మహా మేఘమునుండియుయజ్ఞస్థలమున అవతరించవలెను. ఆమె మా స్తుతులకుప్రసన్నం కావలెను. స్వేచ్ఛగా సుఖకరములగు సంపూర్ణస్తోత్రములను ఆలకించవలెను.

12.బృహస్పతి బలవంతుడు. పుష్టికారకుడు. స్నిగ్ధాంగుడు.అతనిని యజ్ఞగృహమున స్థాపించవలెను. అతడు గృహమధ్యముననిలిచి అంతట వెలుగులు రజిమ్మగలడు.
బృహసప్తిహిరణ్యవర్ణుడు. దీప్తిమంతుడు. మేము అతనిని పూజింతుము.

13.అగ్ని సమస్తమును భరించును. అతడు అత్యంత దీప్తిశాలి.అభీష్టవరదుడు. శిఖా, ఓషధి సమూహమున ఆచ్ఛాదితుడు.అప్రతిహతగమనుడు. లోహిత, శుక్ల, కృష్ణవర్ణత్రింధ శృంగజ్వాలా శిష్టుడు. వృష్టికారకుడు. అన్నదాత.మేము అతనిని ఆహ్వానించుచున్నాము. అగ్ని సంపూర్ణ రక్షణలతోంచ్చేయవలెను.

14.యజమానియొక్క హోత, హవ్యపాత్రధారి ఋత్విగ్గణము- మాతృస్వరూప పృథ్వి ఉజ్వల, ఉత్కృష్టమగు ఉత్తరవేదికిచేరుదురు. చిరంజీవి అగుటకు పసిబిడ్డను నివురినట్లునవజాత కోమలాంగుడగు అగ్నిని స్తుతులు, హవ్యప్రదానముచేసిపోషింతురు.

15.అగ్నీ! నీవు బృహత్ స్వరూపుడవు. వ్రతములందు చిక్కినదేహములుగల దంపతులు నీకు ఒకేసారి విశేష అన్నమునుఅర్పింతురు. దేవగణములు మాచే ఆహుతులు కావలెను.తల్లి భూదేవి మా విషయమున విరుద్ధబుద్ధి కలిగిఉండరాదు.

16.దేవతలారా! మేము మర్యాదగల, బాధలు లేని సుఖముఅనుభవించవలెను.

17.అశ్వినులరక్ష ఆనందదాయకము. సుఖసంపన్నము. అంతకముందుమరెవరికి లభించని అశ్వినుల రక్ష మాకు లభించవలెను.అమరులగు అశ్వినులారా! మీరు మాకు ఐశ్వర్యమును, వీరపుత్రులను,సౌభాగ్యమును ప్రసాదించుడు.

## నలుబదినాలుగవ సూక్తము

ఋషి-కశ్యపగోత్రజుడుఅవత్సారుడు దేవత-విశ్వేదేవతలు, ఛందస్సు-జగతి14, 15 త్రిష్టుప్.

1. ప్రాచీనయజమానులు. మా పూర్వులు సమస్త ప్రాణిజాలము. ఆధునికులుఇంద్రుని స్తుతించి పరిపూర్ణ మనోరథులు అయినారు. అంతరాత్మా!అట్లే నీవు ఇంద్రుని స్తుతించి పరిపూర్ణ మనోరధుడవుఅగుము. ఇంద్రుడుదేవతలలో శ్రేష్టుడు. కుశాసీనుడు. సర్వజ్ఞుడు. సముఖవర్తి.బలశాలి. వేగవంతుడు. జయశీలుడు. అంతరాత్మా! స్తుతులద్వారా ఇంద్రుని వర్ధిల్ల చేయుము.

2. ఇంద్రా!నీవు స్వర్గమునందలి కాంతిని విస్తరింపచేతువు. వర్షించనిమేఘమధ్యమున అందమగు జలరాశి ఉండును. మానవహితమునకుగాను ఆ మేఘమును ప్రేరేపింతువు.అన్ని దిశలందు వర్షము కలిగింతువు. వృష్టి మున్నగుచక్కని పనుల ద్వారా నీవు మానవ జాతిని రక్షింతువు.
నీవుప్రాణములను వధించకుము. శత్రువుల మాయలను అతిక్రమింపుము.
ఇంద్రా!నీ పేరు సత్యలోకమున ప్రఖ్యాతము.

3. ఇంద్రుడుఅప్రతిహతగమనుడు. హోమ నిర్వాహకుడు. బలవిధాయకుడు.ఫలప్రదాత. శిశువు. తరుణుడు. జరారహితుడు. ఓషధులమధ్య స్థితుడు. విశేషముగ కుశలవింద సంచరించువాడు.నిత్యము, ఫలసాధకము, విశ్వదారకము అగు హవ్యమునుఅగ్ని నిరంతరము వహించును.

4. యజ్ఞమునువర్ధిల్లచేయు సూర్యకిరణములు పరస్పర సంయుక్తములయి- యజమాని కొఱకుగాను యజ్ఞ భూమిలో సంచరించు అభిలాషతోఅవతీర్ణములు అగును. సూర్యకిరణములు వేగగాములు.అందఱిని నియమించునవి. ఈ సమస్త కిరణములతో ఆదిత్యుడుజలరాశిని దిగువ ప్రాంతమునకు ప్రేరేపించును.

5. అగ్నీ!నీ స్తోత్రము అత్యంత మనోహరము. సోమరసము చెక్కపాత్రలో ఉండును. దానిని నీవు స్వీకరింతువు. మనోహరస్తోత్రములను ఆలకింతువు. అట్లు నీవు ఉల్లాసవంతుడవుఅగుదువు. అప్పుడు నీవు ఉపాసకుల మధ్య ఎంతో శోభింతువు.జీవనదాతా! యజ్ఞమున నీవు రక్షించుజ్వాలను సర్వత్రవర్ధిల్లచేయుము.

6. ఇదిఎట్లు కనిపించునో అట్లే వర్ణించబడును. సాధక దీప్తియుక్తమయిఅది జలమధ్యమున తన రూపము ధరించును.ఆ దేవతలుమాచే పూజింపబడవలెను. వారు మాకు విశేషధనము,మహావేగము, అసంఖ్యాకులగు వీరపుత్రులను, అక్షయబలమును ప్రసాదించవలెను.
(శాయణుడు"ఏషావైశ్వదేవీ" ఈమెవైశ్వదేవి అన్నాడు. మంత్రమునఆ పేరు కనిపించదు. వైశ్వదేవిని గురించి వివరణ లేదు."యాదృగేవదృశ్యతే తాదృగుచ్యతే" అని మంత్రము)

7. సూర్యుడుసమదర్శి. అగ్రగామి. అతడు అసురులతో యుద్ధాభిలాషగలవాడు.భార్య ఉషతో విహరించుటకు సాహస పూర్వకముగఅగ్రసరుడు అగును. ధనము సూర్యాధీనము. అతడుమాకు ఉజ్వలము, సర్వత్ర రక్షణలు కలిగించు గృహమునుపరిపూర్ణ సుఖమును ప్రసాదించవలెను

8. సూర్యుడుసర్వదేవ శ్రేష్ఠుడు. సూర్యా! యజమానులు నీవద్దకుచేరుదురు. నిన్ను ఉదయాది లక్షణముల ద్వారా తెలుసుకొనవచ్చును.ఋషులు నిన్ను స్తుతింతురు. అందున నీ పేరు వర్ధిల్లును.ఋషులు కోరిన దానిని వారు తమ కార్యముల ద్వారా సాధింతురు.మనస్ఫూ ర్తిగా
పూజించువారికిఫలితము దక్కును.

9. మాసమస్త స్తోత్రములందు ప్రధాన స్తోత్రములు సముద్రతుల్యుడగుసూర్యుని చేరును. యజ్ఞగృహమున విస్తరించిన సూర్యస్తుతికి క్షతి లేదు. పవిత్ర సూర్యునకు తవ చిత్తముసమర్పించిన ఉపాసకుని హృదయగత అభిలాష విఫలముకాదు.ఫలించును.

10.సంతత అందరితో స్తుతించబడువాడు. అందరి కోరికలుపూరించువాడు. అతనివద్ద మాకు క్షత్ర - మనన - అవద-యజత సిద్ధి - అవత్సారనామక ఋషిజ్ఞానులద్వారా భోగయోగ్యము,బలప్రదమగు అన్నము లభించును.

11.విశ్వవార, యజత, మాయీ ఋషుల సోమరస జనిత మదముప్రశంసనీయ గమనముగల శ్యేన పక్షివలె శీఘ్రగామిఅగును. అదితివలె విస్తారమగును. వారు సోమ పానమునకుగానుపరస్పరము ప్రార్థింతురు. విశేషపానము చేయుదురు.అతిరిక్త మత్తత పొందుదురు.

12.సదాస్పణ; యజత; బాహువృక్త; శృతవిత్; తర్య ఋషులువితో కలిసి శత్రుసంహారము చేయవలెను. ఆ ఋషులుఇహపర లోకములందు సకల శ్రేష్ఠకోరికలను సాధించిదీప్తులు కావలెను. ఎందుకనగా వారు హవ్యము, స్తోత్రములద్వారావిశ్వదేవతలను ఉపాసింతురు.

13.యజమాని అవత్సారుని యజ్ఞమున సుతంభర ఋషి సుందరఫలమున పాలయిత అగును. సమస్త యజ్ఞకార్యములుఫలప్రదములగును. గోవులు స్వాదుదుగ్ధములను ప్రదానముచేయును. పాలు అందించబడును. ఈ క్రమమును చాటి అవత్సారుడునిద్రను వదిలి అధ్యయనము సాగించును.

14.సర్వదా గృహమున జాగృతులగు దేవతలను ఋక్కులుఅభిలషించును. సర్వదా జాగృతుడగు దేవతను సామమువరించును. సర్వదా జాగృతుడగు దేవతతో అభిషుతసోమము ఇట్లనవలెను.
"మమ్మువీకరించుము. అగ్నీ! నీనియత స్థానమున సహవాసముచేయుదుము"
"ఆహతవాహమస్మిసఖ్యేన్యోకా:"
(ఆంధ్రవచనఋగ్వేద సంహిత నాలుగవ అష్టకము ఐదవ మండలమునమొదటి అధ్యాయమున మూడవ అనువాకము సమాప్తము)

## నాలుగవఅనువాకము

## నలుబదిఅయిదవ సూక్తము

ఋషి-ఆత్రేయసదాపృణుడు, దేవత - విశ్వేదేవతలు, ఛందస్సు-త్రిష్టుప్.

1. అంగిరులుఇంద్రుని స్తుతించినారు. ఇంద్రుడు స్తుతులు విన్నాడు. స్వర్గమునవజ్రము అందుకున్నాడు. పణులు అపహరించి దాచిన గోవులనుపునరుద్ధరించినాడు. కదలివచ్చు ఉషాకిరణములు సర్వత్రవ్యాపించును. పుంజీభూత అంధకారమును నష్టపరచిసూర్యుడు ఉదయించును. అతడు మానవుల ఇళ్ళవాకిళ్ళనుతెరిపించినాడు.

2. ఘట,పటాది పదార్థము భిన్నరూపములుగా కనిపించును. అట్లేసూర్యుడు తన దీప్తి ద్వారా ిస్తరితుడగును. కిరణజాలములకుజనని ఉష సూర్యుని ఆగమమునకు ీక్షించి ిస్తార అంతరిక్షమునఅవతరించును. దరులను కూల్చునదులు ప్రవాహమానమగుజలరాశి వెంట ప్రవహించును. ఇంటిని నిలుపుటకు ఏర్పరచినగట్టి స్తంభమువలె స్వర్గము సుదృఢ భావముననిలిచి ఉండును.

3. మహాస్తోత్రములస్రష్టలగు ప్రాచీనులవలె మేము ఎంతకాలము స్తుతింతుమోఅంతకాలము మేఘ గర్భములందున్న జలరాశి మా ీదపడుచుండును. మబ్బులు వాన కురిపించును. ఆకాశమునతన కార్యసాధన చేయును. సర్వత్ర పరిచర్యలు చేయుఅంగిరులు కర్మానుష్ఠానము ద్వారా నితాంత పరిశ్రాంతులుఅగుదురు.

4. ఇంద్రాగ్నులారా!మా రక్షణ కొఱకు దేవతలు సేించు ఉత్కృష్ట స్తోత్రములతోమేము ీ ఇద్దరిని ఆహ్వానింతుము. చక్కగా యజ్ఞముచేయు మరుత్తులవలె కర్మతత్పరులు, పరిచర్యలుచేయు జ్ఞానులు స్తోత్రములతో ీ ఉభయులను ఉపాసింతురు.

5. ఈయజ్ఞదినమున శీఘ్రముగ ిచ్చేయుడు. మేము శుభంకరకర్మలు చేయువారలము. ప్రత్యేకముగ శత్రువులనుహింసింతుము. ప్రచ్ఛన్న శత్రువులను దూరము చేయుదుము.యజమానులముందుకు త్వరత్వరగా చేరుదుము.

(ఇిఅంగిరులు అన్నమాటలు)

6. ిత్రులారా!రండు, మనము స్తోత్ర పాఠము చేతము. ఎవనిద్వారా దొంగిలించబడినగోవుల కొట్టము కనిపెట్టబడినదో, ఎవనిద్వారా మనువుహనుిహీన శత్రువును జయించినాడో, ఎవనివలన వర్తకునివలెబహుఫలాకాంక్షి - కక్షీవంతుడు జలమునుకోరి, అడవులకుపోయిజలము పొందినాడో.

(అతనినిస్తుతింతమని "ఇదమప్యంగిరసాం వాక్యం" ఇదియ అంగిరసవాక్యము)

7. ఈయజ్ఞమున ఋత్విక్కుల చేతులందు కదలాడిన శిలాఖండనశబ్దము ఉత్పన్నమగును. ఆ శబ్దము ద్వారముననే నవశ్వులు,దశశ్వులు ఇంద్రుని పూజించినారు.యజ్ఞమందున్న సరమగోవులను పొందినది. అంగిరుల సకల స్తవాది కర్మలుసఫలములు అయినవి.

8. అదిపూజనీయ ఉష అవతరించిన కాలము. అప్పుడే అంగిరులకుగోవులు లభించినవి. గోవులు ఉషతో కలిసినపుడు సత్యమార్గమునసరమ గోవులను చూచినది. అంతట అక్కడి ఉత్కృష్ట యజ్ఞశాలలోపాలవాగులు పారినవి.

9. సూర్యుడుఏడు గుఱ్ఱముల స్వామి. అతడు మా ముందుకు ిచ్చేయవలెను.అతడు శ్రమ సాధ్యమగుబాటన ఒక సుదూర గంతవ్య ప్రదేశమునకు చేరవలసిఉన్నది. సూర్యుడు శ్యేన పక్షివలె శీఘ్రుగాి యయిసమర్పిత హవ్యము కొఱకు అవతరించును. అతడు స్థిరయవ్వనుడు. దూర దర్శి.సూర్యుడు. నిజ కిరణముల మధ్యనిలిచి వెలుగులను పరచును.

10.ఉజ్వల జలరాశిీద సూర్యుడు ఆరోహించును. అతడు వెలుగువెన్నుగల గుఱ్ఱములను రథమునకు జోడించినపుడుధీమంతుడగు యజమాని-నదిలోని ఓడనువలె సూర్యుని ఆహ్వానించును.అతని ఆదేశము ినియే జలరాశి అవనతమగును.

11.దేవతలారా! ఈ స్తోత్రము సర్వదాయకము. ఈ స్తోత్రముననేనవగ్వులు దశమాస సాధ్యయజ్ఞమును సముపార్జించినారు.మేము నీటి కొఱకుగాను అట్టి స్తోత్రములతో ిమ్ము స్తుతింతుము.ఏ స్తోత్రము ద్వారా మాకు దేవతల రక్షణ కలుగునో, దేనివలనపాపపు సీమను అతిక్రిించగలమో అట్టి స్తోత్రమును ఉచ్చరింతుము.

# నలుబదిఆరవ సూక్తము

ఋషి-ప్రతిక్షత్రుడు,దేవత-తొలి ఆరింటికి విశ్వేదేవతలు, మిగిలినవానికి దేవపత్నులు,
ఛందస్సు-జగతి2, 3 త్రిష్టుప్.

1. సర్వజ్ఞప్రతిక్షత్రుడు శకటమున అశ్వమువలె తనను యజ్ఞభారమునకుజోడించినాడు. హోతలమగు మేము అలౌకిక రక్షావిధాయకభారమును వహింతుము. ఈ భారమును తప్పించు కొనవలెనుఅనుకొనుము. ఈ భారము మాటి మాటికి మాకు కలుగవలెననిసహితము కోరము. దారి తెలిసిన అంతర్యామి దేవతలుపురోగాములయి సరళ మార్గమున మానవులను నడిపించవలెను.

2. అగ్ని-ఇంద్ర-వరుణ-మిత్రాదిదేవతలారా! మీరందఱు మాకు బలమును ప్రసాదించండి.విష్ణువు, మరుత్తులు మాకు బలమును ప్రసాదించవలెను.ఆసత్యద్వయము, రుద్రుడు, దేవపత్నులు, పూష, భగుడు,సరస్వతి మా పూజలకు ప్రసన్నులు కావలెను.

3. మారక్షణకుగాను మేము ఇంద్రుని - అగ్నిని - మిత్రుని - వరుణునిఅదితిని - ఆదిత్యుని - ద్యావాపృథ్వులను - మరుత్తులను - పర్వతములను- జలములను - విష్ణువును - బ్రహ్మణస్పతిని సవితనుఆహ్వానింతుము.

4. విష్ణువు- అహింసకారి వాయువు - దానదాత సోముడు మాకు సుఖములుప్రసాదించవలెను. ఋభువులు - అశ్వినులు - త్వష్ట -విభుడు మాకు ఐశ్వర్యము ప్రసాదించుటకు అనుకూలురుకావలెను.

5. పూజనీయులుస్వర్గలోక స్థితులు మరుద్గణములు కుశలపై ఆసీనులగుటకుమావద్దకు రావలెను. బృహస్పతి - పూష - వరుణుడు- మిత్రుడు - ఆర్యమ మాకు గృహసంబంధములగు సంపూర్ణసుఖములనుప్రసాదించవలెను.

6.శుభంకర స్తోత్రవంతములగు పర్వతములు దానశీలలగునదులు మమ్ము రక్షించవలెను. ధనదాత భగుడుఅన్నము, రక్షణలతో విచ్చేయవలెను. సర్వత్ర వ్యాప్తయగుఅదితి మా స్తోత్రములను ఆలకింపవలెను.

7. ఇంద్రాదిదేవతల పత్నులు మా స్తోత్రములు వినవలెను. మమ్ముర్షించవలెను. వారు మాకు బలశాలురగు పుత్రులను,సమృద్ధ అన్నమును ప్రసాదించవలెను.
దేవేరులారా!మీరు భూమిమీద ఉన్నను అంతరిక్షమున ఉన్నను ఉదకవ్రతమున నిమగ్నులగుడు. మేము మిమ్ము ఆహ్వానించుచుందుము.మీరు మాకు సుఖములు అనుగ్రహించుడు.

8. దేవేరులగుదేవపత్నులు హవ్యమును ఆరగించవలెను. ఇంద్రాణి;అగ్నాని; దీప్తిమతి; అశ్విని; రోదసి; వరుణాని ఆదులు విశేషముగామా స్తుతులను వినవలెను. దేవ పత్నులలో ఋతువులఅధిష్ఠాత్రిదేవి మా స్తోత్రములను ఆలకించవలెను. హవ్యమునుఆరగించవలెను.

(ఆంధ్రవచనఋగ్వేద సంహిత ఐదవ మండలమున నాలుగవ అష్టకము రెండవ అధ్యాయము సమాప్తము)

ఓంనతామినన్తి మాయినో నధీరావ్రతా దేవానాం ప్రధమాధ్రివాణి
నరోదసీఅద్రుహా వేద్యాభిరన్న పర్వతాని నమేస్థివాంస:

# మూడవఅధ్యాయము

## నలుబదిఏడవ సూక్తము

ఋషి-ప్రతిరథుడు,దేవత - విశ్వేదేవతలు, ఛందస్సు-త్రిష్టుప్.

1. ఉషపరిచర్యకారిణి, నిత్యతరుణి, పూజనీయ; పూజిత, ఉషఆహుతురాలై శక్తిగల తల్లివలె కన్యస్వరూప పృథ్విని అలరించును. మానవులను పనులందు ప్రవర్తితులనుచేయును. ద్యులోకమునుండి రక్షకులగు దేవతలసహితముగా యజ్ఞభూమికి వచ్చేయును.

2. కిరణములుఎల్లలు ఎరుగనివి. సర్వత్ర వ్యాపించునవి. అవి వెలుగులతోతమ కర్తవ్యమును నిర్వహించును. అమర సూర్యమండలమునఏకత్రితమగును. ద్యావాపృథ్వివి, అంతరిక్షములకు పయనించును.

3. సూర్యునిరథము జలప్రదము. దేవతలకు ఆనందదాయకము.దీప్తిమంతము, ద్రుతగామి. అది జనక స్వరూపమగుతూర్పుదిక్కున ప్రవేశించినది. తదుపరి స్వర్గమధ్యముననిలిచినది. విభిన్న వర్ణుడు, సర్వవ్యాపి సూర్యుని అంతరిక్షపుఉభయ భాగముల అగ్రసరుని చేసినది. సూర్యుడు జగత్తులనురక్షించుచున్నాడు.

4. నలుగురుఋత్విక్కులు తమ శుభములు కోరి సూర్యుని హవి సమర్పించి సేవింతరు. సూర్యుడుదశ దిశల గర్భజాతుడు. దశదిశలు సూర్యుని నిత్యగమనమునకుప్రేరేపించును. ఆదిత్యునకు శత, గ్రీష్మ; భేదమునత్రివిధ కిరణములు కలవు. ఆ కిరణములు అంతరిక్షపుసీమలందు ద్రుతవేగమున సంచరించును.

5. పురోభాగమునదృశ్యమానమగు సూర్యమండలము అత్యంత స్తవనీయము.ఈ మండలము నుండియే నదులు ప్రవహించును. జలరాశిఇందుననే నిలిచి ఉండును. అంతరిక్షమున ఇతర యుగళములతోసమాన బలముగల అహోరాత్రులు ఇందునుండియే ఉత్పన్నములు. ఋత్విక్కులారా!మీరు ఆమండలమును సేవించుడు.

6. అట్టిసూర్యుని కొరకే యజమానులు స్తోత్రములను, యజ్ఞములనువిస్తరింతురు. పుత్ర స్వరూపుడగు సూర్యుని కొరకేతల్లులు-ఉష-దిశలు-బట్టలు నేయును. వర్షకారి సూర్యునిసంపర్కమున తృప్తులయిన పత్నీ స్వరూపరశ్మిలుఆకాశమార్గము నుండి మావద్దకు అవతరించును.

7. మిత్రావరుణులారా!ఈ స్తోత్రము స్వీకరించండి. అగ్నీ! మాకు కలగలుపు సుఖములుకలుగుటకుగాను ఈ స్తోత్రమును స్వీకరించుము. మేముకీర్తి ప్రతిష్ఠల వారలము కావలెను. మేము దీప్తిమంతుడు,శక్తిమంతుడు, సకల జనులకు ఆశ్రయ భూతుడగుసూర్యునకు ప్రణమిల్లుదుము.

## నలుబదిఎనిమిదవ సూక్తము

ఋషి-ప్రతిభానుడు,దేవత-విశ్వేదేవతలు, ఛందస్సు-జగతి.

1. వైద్యుతవిద్యుత్ సంబంధ తేజము సర్వప్రియము. పూజనీయము.బలములు అతని అధీనములు. అన్నములు అతని స్వాధీనములు.ఆచ్ఛాదనకారియగు ఆగ్నేయశక్తి ప్రజ్ఞారూపమగును.అది మబ్బుల పైభాగమున వాననీటిని విస్తారము చేయును.
మేముఅట్టి వైద్యుతాగ్నిని ఎప్పుడు పూజించగలము?

2. ఋత్విక్కులద్వారా లభించగల జ్ఞానమును ఉషస్సులు బోధించగలవా?ఉషస్సులు ఒకరకముగా ఆవరించు కాంతిని సకల జగములందువ్యాపింప చేయును. దేవాభిలాషులగు జనులు గడిచిన,రానున్న ఉషస్సులను వదిలి వర్తమాన ఉషస్సువలనతమ బుద్ధిని వర్ధిల్ల చేసికొందురు.

3. ఇంద్రుడుఅహోరాత్రముల నిష్పన్నమగు సోమము సేవించును. హృష్టుడగును.అప్పుడు మాయావి వృత్రుని పైకి తన సుధీర్ఘ వజ్రమునుప్రదీప్తము చేయును. ఇంద్రాత్మక ఆదిత్యుని శతసంఖ్యాకరశ్మిలు దినములను నివర్తితము, ప్రరివర్తితముచేయును. అవి తమ ఇల్లగు ఆకసమున సంచరించును.

4. పరశువువంటి అగ్ని యొక్క స్వాభా◌ిక స్వరూపమును మేము చూచినాము!రూపవంతుడగు ఆదిత్యుని కీర్తిపుంజమును మా భోగలాభమునకుకీర్తింతుము. ఆదిత్యుడు సహాయకుడయి యజ్ఞ స్థలమునకుఆహ్వానించు యజమానికి అన్నపూర్ణ గృహము రత్నములుప్రదానము చేయవలెను.

5. అగ్నిరమణీయ తేజమున ఆచ్ఛాదితుడగును. అంధకారమునుఅడుగంటించును.
శత్రువులనుదునుమాడును. అగ్ని నలుదిశల తన జ్వాలలను ◌స్తరించును.జిహ్వాద్వారా ఘృతాదులను స్వీకరించును. పురుషత్వముబలము ద్వారా కోరికలు తీర్చు అగ్నిని మేము ఎరుగము.ఏలననగా భజనీయుడగు స◌త వరణీయమగు ధనమునుప్రదానము చేయును.

## నలుబదితొ◌్మదవ సూక్తము

ఋషి-ఆత్రేయప్రతిప్రభుడు, దేవత-◌శ్వేదేవతలు, ఛందస్సు- త్రిష్టుప్.

1. ఇదిగోఇప్పుడే మేము ◌ీ యజమానుల కొఱకు స◌త మఱియుభగుని వద్దకు చేరుదుము. వారు మానవ యజమానులకుధనము ప్రదానము చేయుదురు. నేతృ స్వరూపులగుబహుభోగ కర్తలు అశ్వినులారా! మేము ◌ీ మైత్రి కోరుచున్నాము.మేము నిత్యము ◌ీ ఉపస్థితికి ప్రార్థింతుము.

2. స◌తశత్రు నివారకుడు. అంతరాత్మా! నీవు స◌త ప్రత్యాగమనమునుతెలియుము. స్తోత్రములద్వారా అతని పరిచర్య చేయుము.స◌త మానవులకు శ్రేష్ఠ ధనము ప్రసాదించును.అతనికి నమస్కరించిగాని హ◌స్సులు అర్పించిగాని స్తుతించుము.

3. అగ్నిపోషకుడు. భజనీయుడు. అఖండుడు. అతడు నాలుకతోకఱ్ఱలను కాల్చును. సూర్యతేజమును కప్పివేయును.ఇంద్ర ◌ష్ణు, వరుణ ◌త్ర అగ్ని ఆది దర్శనీయ దేవతలుదినములను ఉత్పన్నము చేయుదురు.

4. ఎంతటివాడునుతిరస్కరించజాలని స◌త మాకు అభిమత ధనమునుప్రదానము చేయవలెను. ఆ ధనమును మాకు అందించుటకుస్పందనశీల నదులు ప్రవహించవలెను. అందుకే మేముయజ్ఞహోతలము. స్తోత్రపాఠము చేయుదుము. మేముబహు◌ధ ధనస్వాములము కావలెను. అన్నము, బలమునరమణీయులము కావలెను.

5. వసువులనుగమనశీల అన్నము అర్పించిన యజమానికి ◌త్రావరుణులనుస్తుతించిన వానికి మహాతేజస్సు కలుగవలెను. దేవతలారా!వారికి దీర్ఘతర సుఖమును ప్రసాదించుడు. మాకు ద్యావాపృథ్వలరక్షణ లభించవలెను. మేము హృష్టులము కావలెను.

## ఏబదవసూక్తము

ఋషి-స్వస్త్యాయముని,దేవత-◌శ్వదేవతలు, ఛందస్సు-అనుష్టుప్, చివరిదిపంక్తి.

1. సర్వజనులుస◌త స్నేహముకోరి ప్రార్థింతురు. సర్వమానవులుస◌త నుండి ధనము కోరుదురు. స◌త అనుగ్రహమునసర్వజనులు పుష్టి కొఱకు తగిన ధనమును పొందుదురు.

2. నేతా!దేవా! మేము యజమానులము. నీ ఉపాసకులము. హోతలుఇంద్రాదిదేవతల ఉపాసకులు. మేము ◌ీవారము కావలెను.మేము ధనయుక్తులము కావలెను. మాకోరికలు తీరవలెను.

3. ఈయజ్ఞమున ఋత్విజుల అతిథులవంటి దేవతలకు పరిచర్యచేయండి. దేవపత్నులకు హ◌ సమర్పించి పరిచర్యచేయండి దేవతలారా! దూరమార్గమున వర్తింపు శత్రువులనుదూరము చేయండి.

4. యజ్ఞవాహకమగుయూపయోగ్య పశువు యూపస్తంభమున ఉన్న యజ్ఞమునసంత యజమానికి కౌశల్యముగల ధీరురాలగు స్త్రీవలెపుత్ర భృత్యాది ధనమును ప్రసాదించును.

5. నేతా!సంతా! నీ రథము ధనవంతము. అది అందరిని పాలించునది.ఆ రథము మాకు శుభములుకలిగించవలెను. మేము స్తుతియోగ్యుడగు సంత స్తోతలము.ధనము, సుఖమునకు గాను సంతను స్తుతింతుము.

## ఏబదిఒకటవ సూక్తము

ఋషి-స్వస్త్యాత్రేయుడు,దేవత-శ్వేదేవతలు, ఛందస్సు - 1-4 గాయత్రి, 5-10 ఉష్ణిక్,11-13 త్రిష్టుప్, 14-15 అనుష్టుప్

1. అగ్నీ!మేము హవ్యము సమర్పించు యజమానులము. ఇంద్రాదిసకల రక్షక దేవతలతో సోమపానమునకు మా వద్దకుచ్చేయుము.

2. సత్యస్తుతులదేవతలారా! రందరు మా యజ్ఞమునకు చ్చేయండి.అగ్ని జిహ్వాద్వారా ఆజ్యమును, సోమరసమును స్వీకరించండి.

3. అగ్నీ!నీవు అభీష్టవరదుడవు. పూజనీయుడవు. ఉదయమునవచ్చు దేవతల సహితుడవయి సోమపానమునకు చ్చేయము.

4. పురోభాగమునఉంచబడిన ఈ సోమము అభిషవణ ఫలకమున అభిషంచబడినది.పాత్రలో నింపబడినది. ఇది ఇంద్ర వాయువులకు ప్రియమయినది.ఇంద్ర వాయువులారా! ఈ సోమరస పానమునకు చ్చేయుడు.

5. వాయువా!హం అందించు యజమాని షయమున ప్రీతుడవగుము.సోమపానమునకు చ్చేయము. చ్చేసి అభిషుత సోమమునుసేంపుము.

6. ఇంద్రవాయువులారా! రు అభిషుత సోమపాన యోగ్యులు. కావునఅహింసకులయి సోమరసము సేంచండి. సోమాత్మకఅన్నము కొఱకు చ్చేయండి.

7. ఇంద్రవాయువులకొఱకు పెరుగు కలిపిన సోమము అభిషుతమయినది.ఇంద్రవాయువులారా! పల్లమునకు పారు నదులవలె సోమముముందునకు చేరును.

8. అగ్నీ!నీవు సమస్త దేవతలతో కలిసి అశ్వినులు ఉష వెంట సమానప్రీతుడవయి చ్చేయుము. యజ్ఞమున అత్రి ఆనందించినట్లునీవు అభిషుత సోమమున ఆనందించుము.

9. అగ్నీ!నీవు త్రుడు వరుణుడు సోముడు ష్ణువు సహితముగచ్చేయుము. యజ్ఞమున అత్రి ఆనందించినట్లు నీవు అభిషుతసోమము ఆనందించుము.

10.అగ్నీ! నీవు ఆదిత్యుడు వసువులు ఇంద్రుడు వాయువు సహితముగచ్చేయుము. యజ్ఞమున అత్రి ఆనందించినట్లు నీవు అభిషుతసోమము ఆనందించుము.

11.అశ్వినులు మాకు అనశ్వర శుభములు కలుగజేయవలెను.భగుడు శుభములు కలిగించవలెను. అదితి శుభములుకలిగించవలెను. బలవంతుడు, సత్యశీలుడు శత్రుసంహారకుడుపూష మాకు శుభములు కలిగించవలెను. జ్ఞానశిష్టద్యావాపృథ్వులు మాకు శుభములు కలిగించవలెను.

12.మాకు శుభములు కలిగించుమని వాయువును స్తుతింతుము.సోముని స్తుతింతుము. సోముడు అఖిలలోక పాలకుడు. సకలదేవతల సహితముగ మంత్రపాలకుడగు బృహస్పతినిమా కళ్యాణమునకు గాను స్తుతింతుము. అదితి పుత్రులుదేవగణములను శుభములు కూర్చుమని ప్రార్థింతుము.

13.ఈ యజ్ఞ దినమున సమస్త దేవతలు మాకు శుభములుకూర్చవలెను. రక్షించవలెను. మానవులనేత, గృహదాత,అగ్నిమాకు శుభములు కూర్చవలెను. రక్షించవలెను.దీప్తిమంతులగు ఋభువులు మా శుభములను రక్షించవలెను.రుద్రదేవుడు మా శుభములను రక్షించవలెను. పాపములనుండికాపాడవలెను.

14.అహోరాత్రి అభిమానులగు ిత్రావరుణులారా! మాకు శుభములుప్రసాదించుడు. హితమార్గగాిని, ధనవతి దేి మాకుశుభములు ప్రసాదించవలెను. ఇంద్రాగ్నులు మాకు శుభములనుప్రసాదించవలెను. దేి అదితి మాకు శుభములు ప్రసాదించవలెను.

15.సూర్యచంద్రులు నిరాలంబ మార్గమున రాక్షసాది ఉపద్రవరహితులయిసంచరింతురు. అట్లే మేముమార్గమున సుఖముగా ప్రయాణము చేయవలెను. ప్రవాసమునచిరకాలము ఉన్నప్పటికి అక్రోధనులు, స్మరణశీలురగుబంధువులతో మేము కలియవలెను.

## ఏబదిరెండవ సూక్తము

ఋషి-ఆత్రేయశ్యావాశ్వుడు, దేవత-మరుత్తు, ఛందస్సు 1-5, 7-15 అనుష్టుప్,6, 16, 17, పంక్తి.

1. శ్యావాశ్యఋషీ! నీవు నెమ్మదిగా స్తుతియోగ్యులగు మరుత్తులనుఅర్చింపుము. యాగ యోగ్య మరుద్గణము నిత్యము హిర్లక్షణఅన్నము పొంది ఆనందింతురు.

2. వారుమరుత్తులు బలములకు ిత్రులు. ధీరులు. వారు మార్గములందుపరిభ్రిింతురు. స్వేచ్ఛగా మా పుత్రులను భృత్యులనురక్షింతురు.

3. మరుత్తులుస్పందనశీలురు. జల వర్షకులు. వారు రాత్రిని అతిక్రిించిసంచరింతురు. మరుత్తుల తేజము ద్యావాపృథ్వులందునిలిచి ఉన్నది. మేము దానిని స్తుతింతుము.

4. మరుత్తులుమర్త్యులగు మానవులను సర్వకాలములందు హింసకులనుండి రక్షింతురు. హోతలారా! అందుకే ిరు మరుత్తులనుమృదువుగా స్తుతించుచున్నారు.

5. మరుత్తులుపూజనీయులు. ిశేషదాన ిశిష్టులు. కర్మనేతలు. అధికబలవంతులు, హోతలరా! అట్టి యాగయోగ్యులు, ద్యుతిమంతులగుమరుత్తులకు యజ్ఞసాధక హవ్యమును సమర్పించుడు.

6. వృష్టినేతలగు మహా మరుద్గణములు వెలుగు ిరజిమ్ముఆభరణములను ఆయుధ ిశేషములను ధరింతురు.వారు మేఘ భేదనమునకుగాను ిశేష ఆయుధములనుప్రక్షిప్తము చేయుదురు. ఉరుములు ఉరుము జలరాశివలెమరుత్తులు వత్తురు. ద్యుతిమంతులగు మరుత్తులకాంతి స్వయం ప్రకాశకము అగును.

7.భూ సంబంధ మరుత్తులు వర్ధిల్లుదురు. అంతరిక్షసంబంధి మరుత్తులు వర్ధిల్లుదురు. వారు నదుల ప్రవాహమధ్యమునను ద్యులోక మధ్యమునను వృద్ధి చెందవలెను.వర్షకార్యమునకు గాను సర్వత్ర వర్తమానులగు మరుత్తులుమేఘ భేదనమునకుగాను ఆయుధ ిశేషములనుదాచి ఉంచెదరు.

8. స్తోతలారా!మరుత్తుల ఉత్కృష్ట బలమును స్తుతించుడు. వారి బలముఅత్యంత ప్రవృద్ధము సత్యమూలము. వర్షనేతలుమరుత్తులు గమనశీలురయి అందరి రక్షణలను వృద్ధిచెందింతురు.జలములకుగాను స్వయముగా పరిశ్రిింతురు.

9. మరుత్తులు'పురుష్ణి' నదిలో ఉందురు. అందరిని శుద్ధము చేయుకాంతులను కప్పుకొందురు. వారు తమ రథ చక్రమునమేఘములను పర్వతములను చెదరగొట్టుదురు.

10.మాకు అభిముఖ మార్గమున వచ్చు మరుత్తులు సర్వత్రసంచరించువారు గిరికందరముల తిరుగువారు అనుకూలమార్గగాములగు నాలుగు పేర్లుగల మరుత్తులు ిస్తరించవలెను.మా కొఱకు యజ్ఞమును వహించవలెను.

11.అభిమత వృష్ట్యాదుల నేతలగు మరుత్తులు లోకములనుభద్రముగా వహింతురు. స్వయం సంిమ్మిళిత స్వయంనిర్మిత జగత్తును ిశేషముగ వహింతురు. దూరదేశమగు అంతరిక్షమున మరుత్తులు గ్రహ, నక్షత్ర,మేఘాదులను వహింతురు. ఆ ిధముగా మరుత్తులరూపము నానాిధము దర్శనీయమగును.

12.ఛందస్సున స్తుతించువారు. ఉదకమును అభిలషించుస్తోతలు మరుత్తులను స్తుతించినారు. దూపగొన్న గోతముడుత్రాగుటకుగాను నూతిని ఏర్పరచినారు. మరుత్తులలో కొందరుదొంగచాటుగా మమ్ము రక్షించినారు. మరుత్తులు ఎన్నియోప్రాణరూపమున కనిపించి దేహబలమును పెంపొందించినారు.

13.మరుద్గణములు దర్శనీయ ిద్యుత్‌రూప ఆయుధములతోిద్యోతమానులు, మేధావులు, అందరి ిధాతలు, శ్యావాశ్వాఋషీ!నీవు అట్టి మరుద్గణములను రమణీయ స్తుతులతో పరిచర్యచేయుము.

14.ఋషీ! నీవు హిర్దానము మఱియు స్తుతుల సహితుడవయిఆదిత్యునివలె మరుత్తుల వద్దకు చేరుము. ీ బలమునఅందరిని ఓడించగల మరుత్తులారా! ీరు ద్యులోకమునుండిగాని ఇతరలోకము నుండిగాని యజ్ఞమునకు ిచ్చేయుడు.మేము స్తుతింతుము.

15.స్తోతలు త్వరగా మరుత్తులను స్తుతింతురు. అన్య దేవతాప్రాప్తి కోరరు. స్తోతలు జ్ఞాన సంపన్నులు, శీఘ్రగాములుప్రసిద్ధులు, ఫలప్రదాతలగు మరుత్తులనుండియే అభీష్టఫలసిద్ధి పొందుదురు.

16.మేము మా బంధువుల అన్వేషణలో ఉన్నాము. అప్పుడు మరుత్తులుమమ్ము ప్రేరేపించినారు. వారు ద్యుదేవతను తల్లిని చేసికొన్నారు.అన్నవంతుడగు రుద్రుని తమ తండ్రిగాచూపినారు.

17.మరుత్తులు సప్తసంఖ్యాకములు. సర్వ సమర్థులు. వారిలోఒక్కరొక్కరు మాకు వేలగోవులను అశ్వములను ఇవ్వవలెను.వారు మాకు అందించిన గోసమూహ ధనము మాకు యమునాతీరమున లభించవలెను. వారు అందించిన అశ్వ సమూహధనము మాకు లభించవలెను.

## ఏబదిమూడవ సూక్తము

ఋషి-ఆత్రేయశ్యావాశ్వుడు, దేవత-మరుత్తులు, ఛందస్సు-1, 5, 11,15కకుభ, 2 బృహతి, 3 అనుష్టుప్, 4 ఉష్ణిక్, 8, 12 గాయత్రి,6,7,9,13,14,16 బృహతి.

1. మరుత్తులఉత్పత్తిని ఎరిగినవాడు ఎవడు? తొలుత మరుత్తుల సుఖమునవర్తమానుడు ఎవడు? మరుత్తులు పృథ్విని రథమునజోడించినపుడు వారి బలరక్షక శక్తిని ఎవడు ఎరిగినాడు?

2. మరుద్గణములురథమున కూర్చున్నారని ఎవడు ిన్నాడు? వారి రథధ్వనినిఎవడు ిన్నాడు? వారు ఏ రీతిగా సాగుదురో ఎవరు ఎరుగుదురు?ఏ దానశీలుని కొఱకు బంధుభూత, వర్షక-మరుద్గణముమరింత అన్నముతో అవతరింతురు?

3. మరుత్తులుసోమపానము చేసినారు. హర్షము పొందినారు. గుఱ్ఱములుఎక్కినారు. మావద్దకు వచ్చినారు. అడిగినారు:-

“మానవులకుహితము కూర్చు నిరాకారుడెవ్వడు” వారు అప్పటి మా స్థితినిచూచినారు. అన్నారు. “ఋషీ! నీవు స్తుతించుము.”

4. మరుత్తులారా!ీ దీప్తి - ఆభరణములను ఆశ్రయించిన దీప్తి; ఆయుధములు,మూలలదీప్తి; ఉరపు భూషణములు దీప్తి; హస్త, పాదభూషణముల దీప్తి; రథపు దీప్తి; ధనుస్సు దీప్తి;అట్టి సమస్త దీప్తులకు మేము ప్రణిల్లుదుము.

5. శీఘ్రదానశీలురగుమరుత్తులారా! సర్వత్ర వర్షపు గమనశీల దీప్తివంటిదృశ్యమానమగు ీ రథము మాకు సంతోషము కలిగించును.మేము స్తుతింతుము.

6. మరుత్తులునేతలు. శోభన దానశీలురు. వారు హం సమర్పించుయజమానుల కొఱకు ఆకసమునుండి నీరునిండిన మబ్బునుకురిపింతురు. వారు ద్యావాపృథ్వులకుగాను మబ్బులనుండిపింతురు. తదనంతరము. సర్వత్ర సంచరించిఉదక సహితులయి వ్యాపింతురు.

7. పాలిచ్చుకొత్తగా ఈనిన ఆవో అనునట్లు భేదించరాని మేఘమునుండివెడలిన జలరాశిలోని నీరు అంతరిక్షమున ప్రసారితమగును.బాటన సాగుటకు వదిలిన వడిగల గుఱ్ఱమువలె నదులుమహావేగమున ప్రవహించును.

8. మరుత్తులారా!ీరు ద్యులోకమునుండిగాని అంతరిక్షము నుండిగానిఈ లోకమునుండిగాని వేంచేయుడు. దూరప్రదేశములగుద్యులోకము ము‍న్నగువానిలో నిలువరాదు.

9. మరుత్తులారా!రసా, అనితభ, కుభనామక నదులును సర్వత్ర గంచుసింధు ుమ్ములను నిలుపరాదు. జలమయి ‘సరయు’ ుమ్మునిలుపరాదు, మాకు ీరాక వలన సుఖము కలుగవలెను.

10.మరుత్తులారా! ీకు ప్రేరకమగు ీ నూతన రథ బలమునుదీప్తిమంతులగు ుమ్మ మేము స్తుతించుచున్నాము.వర్షము మరుత్తులను అనుసరించును.

11.మరుత్తులారా! మేము స్తుతులతోను హం ప్రదానముననునీ బలమును అంవక్షిత గణమును సప్త సముద్రగణమునుఅనుసరింతుము.

12.నేడు హవ్యములు సమర్పించు ఏ యజమాని వద్దకుప్రకృష్ట రథమున మరుత్తులు ంచ్చేయుదురు?

13.మరుత్తులారా! ీరు దయార్ద్రులు ీరు పుత్ర పౌత్రాది,అక్షీణ ధాన్య భీజమును బహుపర్యాయములు ప్రదానముచేయుదురు. అట్టి కరుణాపూరిత హృదయముననేమాకు సహితము అటువంటి ధాన్య భీజమును ప్రదానముచేయుడు. మేము ీనుంచి సౌభాగ్య ధనమును వాంఛింతుము.

14.మరుత్తులారా! మాకు శుభములు కలుగవలెను. పాపములుమమ్ము పరిత్యజించవలెను. మేము నిందకులగు శత్రువులనుజయించవలెను. ీరు వర్షము కలిగింతురు. అందువలనమాకు శుభము కలుగవలెను. పాపనివారక జలము గోయుక్తఔషధము లభించవలెను.

15.మరుత్తులారా! ీరు నేతలు, పూజ్యులు. ీరు రక్షించువారిని దేవతలు అనుగ్రహింతురు. శోభన పుత్ర పౌత్రాదియుక్తులనుచేయుదురు.మేము నీవారము. మేము నీ రక్షణ పొందినవారముకావలెను.

16.ఋషీ! యజమాని స్తుతించువాడు. అతని యజ్ఞమున దాతలగుమరుత్తులను స్తుతించుడు. తృణాదులు తినుటకు గోవులుసాగును. అట్లే మరుత్తులు ఆనందింతురు. పురాతన బంధువులవంటి మరుత్తులను ఆహ్వానించుము. స్తోత్రప్రియ మరుత్తులనువచనములతో స్తుతించుము.

# ఏబదినాలుగవ సూక్తము

ఋషి-శ్యావాశ్వుడు,దేవత-మరుత్తులు, ఛందస్సు-జగతి 14 త్రిష్టుప్.

1. మరుత్తులబలమును ప్రశంసించండి. వారు తేజో ిశిష్ట పర్వతములనుచెదరగొట్టువారు. ఉష్ణ నివారకులు. ద్యులోకము నుండివచ్చువారు. ద్యుతిమంతులు. అన్నవంతులు. వారికి ఎంతోఅన్నము ప్రదానము చేయుడు.

2. మరుత్తులారా!ీ గణములు ప్రాదుర్భ ించిన ి. అ ి దీప్తిమంతములు.జగద్రక్షణార్థము జలాభిలాషులు. అన్న వర్థయితులు. గమనించుటకురథమును అశ్వయుక్తము చేయున ి. ిద్యుత్తుతో కలిసిపోవున ి.నలుదిక్కుల పయనించు జలరాశి అంతరిక్షము నుండినేలీద పడును.

3. మరుత్తులుద్యుతిమంత తేజోవంతులు. వర్షనేతలు. అయుధయుక్తులు.ప్రదీప్తులు, మేఘ ిధీర్ణులు. వారంవారం ఉదకదాతలు.వజ్రక్షేపకులు. ఏకత్ర శబ్దాయమానులు. ఉద్ధతబలలు. మరుద్గణములువర్షముకొరకు ప్రాదుర్భూతులు అయినారు.

4. రుద్రపుత్రులగుమరుత్తులారా! ీరు రాత్రింబవళ్ళను కలుగచేతురు.సర్వ సమర్థులారా! ీరుఅంతరిక్షమును లోకములను వెల్లడి చేయుదురు. కంపనకారులారా!సముద్ర మధ్యస్థ నౌకవలె మేఘములను కంపింపచేయుడు. మరుత్తులారా! శత్రునగరములను ధ్వంసంచేయుడు. "నాహరిష్యధ"హింసించకండి.

5. సూర్యుడుఎంతో దూరమువరకు తనకాంతిని ిస్తరింప చేయును.అట్లే మరుత్తులారా! ీ సుప్రసిద్ధ ిర్యమును బలమునుస్తోతలు ఎంతో దూరము వరకు ిస్తరింప చేయుదురు.

6. మరుత్తులారా!ీరు వృష్టి ిధాతలు. ీరు జలవంతమగు మేఘమునుబాదుదురు. ీ బలము శ్రేయస్కరము. పరస్పర గమనప్రీతిగలమరుత్తులారా! మార్గ ప్రదర్శనమున నేత్రము నాయకత్వమువహించినట్లు మమ్ము సుగమ మార్గమున ధనాదులవద్దకు చేర్చుడు.

7. మరుత్తులారా!ీరు మంత్రద్రష్టయగు ఏ ఋషిని లేక రాజును సత్కర్మలకుప్రేరేపింతురో అట్టివాడు ఇతరులచే పరాభూతుడు కాడు.హింసితుడుకాడు. అతడు ఎన్నడూ క్షీణించడు. పీడింపబడడు.అతనికి ఎటువంటి బాధ కలుగదు. అతని రక్షణలకు, ధనమునకునష్టము వాటిల్లదు.

8. నియుతనామకఅశ్వయుక్తులు, సంఘాత్మకులు, నరాకారులు. ఆదిత్యునివలెదీప్తులగు మరుత్తులు ఉదకవంతములు. వారు అధిపతులయినపుడునేలనున్న బావులను - ఆకాశమున ఉన్న మబ్బులను జలపూర్ణముచేసెదరు. శబ్దాయమాన సారభూత, సుమధుర జలములతోభూ ిని తడిపెదరు.

9. మరుత్తులకొరకు పృథ్వి ిస్తీర్ణమగును. ద్యులోకము మరుత్తులసంచారమునకు ిస్తీర్ణమగును. అంతరిక్ష మార్గములుమరుత్తుల రాకపోకలకు ిస్తీర్ణమగును. మరుత్తులకొరకే మేఘములు పర్వతములు వర్షకారకములగును.

10.మరుత్తులు మహాబలవంతులు. అందరినేతలు - ద్యులోకనాయకులు. వారు సూర్యోదయమున సోమపానమున హృష్టులుఅగుదురు. అప్పుడు వారి అశ్వములు నడకలో శిథిలములుకావు. వారు ముల్లోకముల మార్గములన్నింటిని దాటుదురు.

11.మరుత్తులారా! ీ మొలకు ఆయుధములున్న ి. కాళ్ళకుకడియములు, ఉరమున ఆభరణములున్న ి. ీరు రథమునదేదీప్యమానులయి ఉన్నారు. ీ చేతులందు అగ్ని దీప్తకిరణములు ఉన్న ి. తలీద బంగారు మకుటము ఉన్నది.

